


వృద్ధపాంథుడు

చిత్రం : కె. వి. నారాయణ్-రాజమండ్రి

# నేడే చూడండి!



విజయా వారి

# అప్పుచేసి పప్పుకూడు

డైరెక్షన్ ప్రసాద్



నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి



# ఆంధ్ర సచిత్ర వారపత్రిక


| | | |
|---|---|---|
| సంవత్సర చందా | Founder: K. NAGESWARA RAO | సంపుటము 58 |
| రు. 13—0—0 | విలంబి పౌష్యం శుద్ధ ద్వాదశి బుధవారం | సంచిక 18 |
| విడిప్రతిక 25 న.పై | | 21-1-59 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

విజయా వారి "అప్పు చేసి పప్పు కూడు" చిత్రంలో

గిరిజ





# రాజధాని కబుర్లు

## ఇంద్రజాలికుడు ఆర్థికమంత్రి

అప్పు కావలిసిన వాళ్ళని రెండువిషయాలు గుర్తుంచుకొమ్మన్నాడు పి. జి. వుడ్‌హౌస్. ఒకటి, డబ్బున్నవాళ్ళనే అడగాలి రెండు, అప్పిచ్చేవాళ్ళనే అడగాలి ఈ రెండు విషయాల్లో దేన్ని విస్మరించినా, చేయిచాపి లాభం లేదుట.

మా తాతగారు నాకు చిన్నప్పుడు ఒక పద్యం నేర్పారు. అది పద్యం ఔనో కాదో నేను చెప్పలేనుగాని, అది సరదాగా ఇలా నడుస్తుంది: 'పాడు ముడిగితివి; లేదంటిని. వడివడి చేయి చాపితివి. నీ ముక్కంత దిబ్బ జేసివదిరా, ఎటనెటరా?' అంటూ. అప్పకవి ఈ పద్యం వింటే, ఆశ్చర్యంగా ముక్కు మీద వేలేసుకుంటాడు గాని, పాడుం కావల్సివచ్చి బాధపడేవాడు ఆశ్చర్యపడడు. డబ్బు అవసరం తెలుస్తున్నవాడూ ఆశ్చర్యపడడు; నేనూ ఆశ్చర్యపడలేను.

ఇక్కడో చిన్న ఇబ్బంది ఉంది.

అప్పు ఇచ్చేవాడు కూడా రెండు విషయాలు గుర్తుంచుకుంటాడు. ఒకటి, అప్పు తిరిగి వాపస్ చేసే వాడికే ఇస్తాడు; రెండు, వాపస్ చేయడానికి డబ్బున్న వాడికే ఇస్తాడు. అందువల్ల, సాధారణంగా అప్పు కావలిసినవాడికి అప్పు దొరకదు. వద్దన్నవాడి గుమ్మంలో ఎప్పుడూ పడిగాపులు గాస్తూ ఉంటుంది డబ్బు.

సూర్యుడు చుట్టూ ఎప్పుడో తిరగడం మానేసింది భూమి! డబ్బుచుట్టూ తిరుగుతూంది ఈ రోజుల్లో!! ఇది అబద్ధం అంటారు శాస్త్రజ్ఞులు; నమ్మకండి. వాళ్ళు కూడా ఈ భూమిమీద బతికేవాళ్ళే—వాళ్ళ ఆలోచనలు ఆకాశంలో మెదిలినా! అందువల్ల భూమితోబాటు వాళ్ళు కూడా డబ్బుచుట్టూ తిరుగుతూంటారు!

* * *

భరించేవాడు భర్త; భరింపబడేది భార్య. డబ్బు సంపాదించేవాడు భర్త. డబ్బు కుటుంబావసరాలను దృష్టిలో పెట్టుకొని ఖర్చు పెట్టేది భార్య. భార్య ఒక వేళ సంపాదించి, భర్త ఖర్చుపెట్టడం ప్రారంభిస్తే ఈ నిర్వచన ప్రకారం భార్య భర్తకి 'భర్త'ఔతుంది; భర్త భార్యకి 'భార్య'ఔతాడు.

ఈ నిర్వచనం ప్రకారం ఆలోచిస్తే, ప్రభుత్వంలో మంత్రులందరికీ ఆర్థికమంత్రి భర్తౌతాడు. ఒక్కొక్క మంత్రీ ఆర్థికమంత్రివద్దకు వచ్చి, "ఏమండీ! ఏమండోయి! వింటున్నారా? ఫలానా పథకానికి ఈ సంవత్సరం 'ఇంత' డబ్బు కావాలి" అంటాడు. వెంటనే ఆర్థికమంత్రి అందుకొని, "ఫలానా పథకం ఈ సంవత్సరం వద్దు. అంతడబ్బు మనకి లేదు" అంటాడు. ఆ మంత్రి ససేమిరా అంటే, "ఆ పథకం అమలులోకి రాకపోతే—నలుగురిలోకి వెళ్ళడం కష్టంగా ఉంటుందండీ" అంటే, ఆర్థికమంత్రి కొంచెం చలపడి, "పోనీ. ఏం ఖర్చుపెట్టినా, మనకోసమే కదా! కొంచెం పొదుపుగా ఖర్చుపెడితే సరి" అంటాడు.

* * * *

రాష్ట్రావసరాలకు డబ్బు వెతుకవలసిన బాధ్యత ఆర్థిక మంత్రిది. ఆర్థికమంత్రైన ప్రతివాడు ఇదివరలో అమల్లోఉన్న ఆర్థిక సిద్ధాంతాలనన్నిటినీ కంఠతా పట్టి అట్టే పెట్టుకొంటాడు. అంతే కాదు-మన శాస్త్రానికి సంబంధించిన అభిప్రాయాలు అతనికి తెలుసు. 'లేదు, కాదు' అనడంలో సొగసు, నేర్పు ఆర్థిక మంత్రులకు తెలిసినంతగా మరెవరికీ తెలియదు. అంతే కాదు—ఇంద్రజాలం కూడా కొంత నేర్చుకొని, అంకెల్ని తికమక పెట్టి, అంకెల తికమకలతో శాసనసభ్యుల్ని, ప్రజల్ని తికమకలు పెట్టగలిగిన సామర్థ్యం అతని కుండాలి అని చెప్పిన పి. జి. వుడ్‌హౌస్ సిద్ధాంతం వంకబెట్టనే అక్కరలేదు. అది ఆర్థిక మంత్రులందరూ అవసరమైతే తలక్రిందుగా అప్పచెప్పగలరు.

ఆర్థికమంత్రులందరికీ పైన చెప్పిన విషయాలు క్షుణ్ణంగా అర్థమయ్యేఉంటాయి. ఆర్థిక మంత్రులు కూడా మనుష్యులే కాబట్టి—ఒక్కొక్కప్పుడు, బాగా కోపంగా ఉన్నప్పుడు, వాళ్ళు మనుష్యులు కారనేవాళ్ళుకూడా లేకపోలేదు—వీళ్లల్లో రకాలు ఉంటాయి. ఉదాహరణకి చింతామణీ దేశ్‌ముఖ్‌కి ఆర్థిక సిద్ధాంతాలలో పరిచయం జాస్తి. ఆర్థికమంత్రిగా శ్రీ బెజవాడ గోపాలరెడ్డికి మానవ మనస్తత్వశాస్త్రం బాగా తెలుసు. ఆయన్ని 'పన్నుల మంత్రి' అన్నారు ప్రజలు. హఠాత్తుగా నిద్రలేచి ఆయన్ను అడిగితే ఏపన్ను ఎలా ఎక్కడవేస్తే బాగుంటుందో సునాయాసంగా చెప్పేసేవారుట ఆయన.

ఆంధ్రప్రదేశ్ ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి ఆర్థిక సిద్ధాంతాలు తెలుసు. కాని అంతకంటే ఎక్కువగా ప్రవేశం మనస్తత్వ శాస్త్రంలో. ఇంద్రజాలంలో సర్కార్‌కి పాఠం చెప్పగలరాయన.

'అలీబాబా-నలభై దొంగలు' కథలో 'ఓపెన్ సెసేమ్' అంటే సొరంగద్వారం తెరుచుకుంటుంది. కొందరు ఇంద్రజాలికులు కర్ర ఊపుతారు; కొందరు తలఊపుతారు. కొందరు తీక్షణంగాచూస్తారు;



శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి

# రాజధాని కబుర్లు

కొందరు కన్నుగీటుతారు. ఇవన్నీ పద్ధతులలో భేదాలు. లక్ష్యం ఒక్కటే: ఎదుటివారిని ముగ్ధుల్ని చేసి, తమ అభిప్రాయాలకు అనుకూలంగా వాళ్ళు నడుచుకొనేటట్లు చేయడం.

ఇంగ్లీషులో 'పర్సనాలిటీ' అంటామే! అది శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి ఉంది. గంభీరమైన చూపు. మెరుస్తున్న కళ్ళద్దాల వెనుక కనిపించే భావాలు ఏమి సూచిస్తున్నాయో కనుక్కోడం ఎదుటి వాళ్ళకి కష్టం. మీరు మాటాడుతూంటే, ఆయన తలూపుతుంటారు. మీరు చెప్పినవన్నీ వారు అంగీకరించారని మీరు అనుకుంటే పొరపాటు. ఆయనతో పది నిముషాలు మీరు మాటాడిన తర్వాత, ఆయన అభిప్రాయాలను మీరు ఇంటికి మోసుకుపోతారేమో కాని, మీ అభిప్రాయాలను వారు అంగీకరించారనుకోడం పొరపాటు.

శాసనసభ ప్రతిపక్ష నాయకుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య; శ్రీ సుందరయ్య ప్రతిపక్ష నాయకుడు. ప్రభుత్వ విధానాలలో కొన్ని ప్రజాసమ్మతం కానప్పుడు—కావని ఆయన భావించినప్పుడు—ఆ విధానాలను తీవ్రంగా విమర్శించడం, సాధ్యమైనంతవరకు ఆ విధానాలు అమలులోకి రాకుండా చూడడం శ్రీ సుందరయ్య నిర్వర్తించవలసిన విధుల్లో ఒకటి. ఈ విధి నిర్వహణకోసం నిరంతరం కృషి చేస్తూంటారు ఆయన. అంకెల సముద్రంలో మునుగుతూ తేలుతూ ఉంటారు.

రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు జీతాలు తక్కువ. తెలంగాణా ఉద్యోగులకు ఆంధ్ర ప్రాంతోద్యోగులకు వేతనాలలో భేదాలున్నాయి. ప్రభుత్వం ఇచ్చే జీతం సరిపడడం లేదని మొరపెట్టుకున్నారు ఉద్యోగులు. ప్రభుత్వం ఒక 'పే కమిటీ'ని వేసింది. ఆ సంఘంలో శ్రీ సుందరయ్య సభ్యులు. అధ్యక్షులు ఆర్థికమంత్రి.

ఉత్పన్నమైన సమస్యల్ని పరిష్కరించడమే కాని, కొత్త సమస్యల్ని కొనితెచ్చుకోడం ఏ మంత్రికీ ఇష్టం ఉండదు. అందులో ఆర్థిక మంత్రికి అసలే ఉండదు. ఎన్. జీ. ఓ. లకు వేతనాలు హెచ్చు చేస్తే, అవసరమైన డబ్బంతా సమకూర్చుకోవలసిన బాధ్యత ఆర్థిక మంత్రిది. అందువల్ల ప్రభుత్వోద్యోగులు మంత్రులు జాగరూకతతో మెలగడం సహజమే. కాని ఎన్. జీ. ఓ. లంతా శ్రీ సుందరయ్య ఉన్నారు; ఎట్టి పరిస్థితులలోనైనా మనకు జీతాలు కావాలనే అడుగుతారు. బలే బలే అనుకున్నారు.

వేతన సంఘం నివేదిక వచ్చింది. నివేదిక సభ్యులు ఏకగ్రీవంగా ఆమోదించారు. శ్రీ సుందరయ్య నివేదికపై సంతకం పెట్టారు.

వచ్చే ఎన్నికల్లో మళ్ళీ కాంగ్రెసు ఘనవిజయం సాధిస్తే, ఆ విజయానికి కారణంగా – ప్రధాన కారణంగా – ఇంద్రజాలికుడు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిని చెప్పుకోవలసి ఉంటుంది. మరో కారణం – [illegible] నాయకుడు శ్రీ పుచ్చలపల్లి.

## ఉద్యోగాలు - వేతనాలు:

బెర్ట్రాండు రసెల్ ఒకసారి సోమరితనంలో గొప్పతనాన్ని ఉద్ఘాటిస్తూ, ఒక వ్యాసం వ్రాశాడు. పైపైకి అవహేళన చేస్తున్నట్టు వ్రాసినా, ఆ వ్యాసం పంక్తులమధ్య దాగిఉన్న భావాలు గంభీరంగా

ఉన్నాయి. ఉద్యోగుల కార్యనిర్వహణకాలాన్ని తగ్గించడంలోగల ప్రయోజనాలను ఆ వ్యాసంలో రసెల్ పేర్కొన్నాడు.

పదకొండు గంటలకి ఆఫీసుకివచ్చి, ఐదుగంటలకు వెళ్ళిపోయినా, నగరంలో ఉద్యోగులు చాలినంతపని చేయడంలేదని ఉన్నతాధికారుల అభిప్రాయం. ఆరుగంటలకాలంలోను పనిచేసేది ఒకటి రెండు గంటలేనని ఉద్యోగులు కూడా అంగీకరిస్తారు. ఈ జరిగేపనిలోకూడా చాలవరకు కాగితాలపనేకాని, నిజంగా జరిగేది తక్కువ అని ప్రజలు మొరపెట్టుకుంటూంటారు.

వేతనసంఘం సూచనలువచ్చినతర్వాత, నగరంలో కార్యాలయాలు పదిగంటలకే ప్రారంభించాలని ఒక అభిప్రాయంవచ్చింది అభిప్రాయమేకాదు; ఈ ఉత్తర్వులు జారీచేయబోతున్నాయి. ఆఫీసులు ఒకగంట ఎక్కువపనిచేస్తే, ఆఫీసరు ఒకగంట ఎక్కువపనిచేస్తారో, మరి ఒకగంట ఎక్కువవ్యర్థంచేస్తారో తెలియదు.

రాజధానినగరంలో బస్సులకు అలవాటులేనిపనుల్లో ఒకటి సమయానికి రావడం. బస్సులకు అలవాటులేని పనుల్లో రెండోది సమయానికి ప్రయాణీకులను వెళ్ళవలసిన చోటికి చేరవేయడం. అందువల్ల పదిగంటలకి కార్యాలయం చేరవలసిన ఉద్యోగి ఉదయం ఎనిమిదిన్నరకి భోజనం పూర్తిచేసి బస్సుస్టాండుకు చేరుకోవాలి.

వేతనాల సంఘం ఇవన్నీ తీవ్రంగా పరిశీలించినట్టే కనపడుతూంది. దేశంకోసం నడుములు బిగించుకు పనిచేయవలసిన ఈ కాలంలో 'మినిమమ్' సిద్ధాంతం విలువను మనం మరచిపోలేం. సరైన జీతం ఇస్తూన్నంతకాలం ఉద్యోగులను భోజనం మానమన్నా మానరు. జీతాలు తగ్గిస్తే, భోజనాలు తగ్గిస్తే బస్సులు ఆలస్యంగా వచ్చినా, కార్యాలయాలకు చేరుకుంటారు ఉద్యోగులు.

అదీ సంగతి! భోజనాలు - ఒకపూటైనా - మానేసి. బియ్యం ధరలు తగుతాయి. బియ్యం ధరలతో అన్నిధరలూ తగుతాయి! ధరలు తగితే, జీతాలు తగ్గినా ఫరవాలేదు.

వేతనసంఘం సిఫార్సుల ఫలితంగా, జీతాలు తగ్గనున్నాయని గోల పెడుతున్నారు. ఉద్యోగులు నిదర్శనాలు కురిపిస్తున్నారు. అటువంటి నిదర్శనాలవైపు దృష్టి పరిపించక పోవడమే న్యాయం.

* * * *

## డాక్టర్లు - ఏక్టర్లు - 'కళాకారులు':

డాక్టర్లకు డిగ్రీలున్నట్టే ఏక్టర్లకు కూడా ఉండాలని 'పద్మశ్రీ' స్థానం అభిప్రాయం. ఫలానా డిగ్రీ ఉంటేనేకాని సూదిలో మందెక్కించకూడదని, శరీరంలో సూదెక్కించ కూడదని డాక్టర్లకు నిబంధన ఉన్నట్టే ఫలానా డిగ్రీ ఉంటే కాని, మొహానికి రంగుపూసుకోరాదని నియమం ఉండడం మంచిదే. 'పద్మశ్రీ'తో ఈ 'ప్రవీణుడు' ఏకీభవిస్తున్నాడు.

పత్రికలలో ఒకసారి కథపడితే, కథకుడు మహాకథకుడైపోయి, పరిణామం పొంది నాటక కర్తగా దర్శనం ఇస్తున్నాడు. నాటకం కనిపించిందే చాలు, చటుక్కున లాక్కొని ప్రదర్శించేస్తున్నారు నటులు. ఎటొచ్చీ, బాధపడేది ప్రేక్షకులు. శిక్షణ లేకుండా మందులిచ్చే డాక్టర్లవల్ల బాధపడేది రోగులు.

ఐతే—ఇక్కడ ఒక చిన్న చిక్కు ఉంది. డాక్టరును తయారు చేయడానికి డాక్టర్లున్నారు. ఏక్టరును తయారుచేయడానికి ఏక్టర్లు దొరకరు. దూరాన సంగీతనాటక అకాడమీ ఉంది. అది ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీయేగాని, తెలుగువాళ్ళ అకాడమీ కాదు. విశ్వవిద్యాలయాల్లో పనిచేస్తూ నాటక కళమీద విభిన్నాభిప్రాయాలను వెలిబుచ్చే విపరీతాభిప్రాయాలను మనం శాశ్వతం చేసుకోవలసిందేనా? పెళ్ళాం చచ్చిపోతే, 'హా ప్రేయసీ!' అంటూ కన్నీళ్ళు వచ్చేవరకు కాచుకొని నిలబడే 'ఏగ్రేడు' ఏక్టర్లేనా ఆచార్యపీఠం అలంకరించేది రేపు?



సంధ్యగొబ్బిళ్ళు
— చిత్రం: పూర్ణానంద శర్మ]

రసదృష్టి లేకుండా, నటన లక్ష్యం లేమిటో తెలియకుండా, రంగస్థలంపై ప్రవేశించే 'ఏగ్రేడు' ఏక్టర్లంటే నాకెంత విహ్యాభావం ఉందో, స్థానంవారికీ అంతే ఉందని నాకు తెలుసు. ముందు మెళకువలు, అభ్యాసాలు, వర్తనలు పరీక్షించి శిక్షణ ప్రారంభిస్తే మంచిదే. కాని అకాడమీలను నింపినట్టే, కళాశాలలను నింపితేమాత్రం నేను నాటకరంగంపై కనుపించే అపస్వరాలు శాశ్వతమైపోతాయి.

* * * *

గతవారం ఆంధ్రయువతీ మండలిలో దక్షిణభారత హిందీ ప్రచారసభ వార్షిక సమావేశం జరిగింది. ఆ సమావేశ సందర్భంలోనే శ్రీ స్థానం ప్రసంగించారు. 'పద్మశ్రీ' ఉపన్యాసాలు వినసొంపుగా ఉంటాయి. వారి ఆనాటి ఉపన్యాసం ప్రేక్షకులను రంజింపచేసింది.

ఆ సమావేశ సందర్భంలోనే శ్రీ ఇలుకపల్లి దక్షిణామూర్తి రచించిన 'కళాకారులు' నాటిక ప్రదర్శించబడింది. శ్రీయుతులు నండూరి విఠల్, వె. లక్ష్మయ్య, రామారావు, మహేశ్వరరావు, కృష్ణమూర్తి పాల్గొన్నారు. కథ సినీమా ఫక్కీలో నడిచింది. సంభాషణలు నటీనటులు పలుకదగినవిగా లేవు. ప్రధానంగా కామేశ్వరరావు పాత్రచిత్రణం సహజంగా లేదు. రచయిత ప్రథమ ప్రయత్నం ఇదిఅని గుర్తిస్తే, ముందుముందు అతను మంచి రచనలు చేస్తాడని ఆశించవచ్చు. చిదంబరంగా శ్రీ నండూరి విఠల్ చక్కగా నటించారు. అప్పటి పాత్రధారి నటనలో 'అతి' కనుపించింది. సహజంగా నటించడం నేర్చుకుంటే వారి సునాయాసగమనం ప్రేక్షకులను రంజింపచేస్తుంది.

[63-వ పేజీ చూడండి]

# సమర్పణ

## కందుకూరి లింగరాజు

4

(స్వర్ణోత్సవ సంచిక తరువాయి)

"ఈ స్వాముల వారికి ఆ అగ్రహారం లో చెప్పదెబ్బలు కొట్టేపర్యంతం అయితే. రాత్రికి రాత్రే ఉడాయిం చేట" అని అరుగుమీద కూర్చుని పొగాకు కాడ తుంపుతూ సూర్పరాజు అన్నాడు. పరివారంగా మాదిగ వీరడు, చినరెడ్డి, మంగలి వెంకటరత్నం, రంగాచారి వున్నారు. ఇంకా ఇగురు ప్రాగురుగా నలుగురైదుగురు ఊసుపోక వచ్చిన వాళ్ళు వింటున్నారు లోకాభిరామాయణం.

అక్కడా ఇక్కడా విన్న కబుర్నీ పోగుచేసి చిలవలు పలవలూ అల్లి ప్రతిరోజూ రచ్చబండలా వ్యవహరించడం సూర్పరాజుకి అలవాటు. ఈ కబుర్లు పోగు చెయ్యడం కోసం కనపడ్డ ప్రతివాడిని నిలదీసి పెద్ద సత్తెదారులా ప్రశ్న పరంపరలు కురిపించడం అతిడినైజం. దాంతో సూర్పరాజు ఆ వీథిని నుంచున్నాడంటే తప్పించుకుపోయేవాళ్ళ సంఖ్య ఎక్కువగా వున్నా, రాచవారి పగ మనకెందుకులే అపరదూర్వాసుడు అని ఒక చిరునవ్వు నవ్వి క్షేమప్రశ్న వేసి పోదామనుకొని ఘంటల తరబడి నిల్చిపోయి లోపలలోపల తిట్టుకునే మనుష్యులు లేకపోలేదు, అగ్రహారంలో.

ప్రత్యేకంగా ఈ కోవలోకి చేరినవాడు రంగాచారి. ఉన్న పదివైష్ణవగడపలకు అతనే పెద్ద. ఊళ్ళో వున్న విష్ణ్వాలయానికి పూజారి. అటు సోమయాజికి ప్రతిగా నిలచి సమవుజ్జీ అనిపించుకో తగినవాడు. సూర్పరాజును కొలువు చేసుకుంటే ఎప్పటికైనా మంచిదన్న అభిప్రాయం కొద్దీ కాలంవేసే రకం మనిషి రంగాచారి.

"నిజమే నంటారా? ఏడికేనా అపరాధం జరుగుతది రాజుగారూ?"

"ఏడికే! ఆ సోమయాజులుకు వయస్సు వళ్ళంకొద్దీ బుద్ధి సన్నగిల్లుతోంది. లేకపోతే, ఏడికి ఛీ అంటూ తీసుకురావడం ఏమిటి?" చినరెడ్డి సాయంగానే అన్నాడు.

మూలఒదిగిన వీరడు "ఏం జరిగింది బాబయ్యా?" అని ప్రశ్న వేసేశా, వాడికి తెలియక, వినాలన్న కుతూహలం ఒగులుకో లేక.

"రంగాచారిగారూ! ఓసారి చెప్పండి," అని పురమాయించేడు రాజు.

ఓసారి సభంతా కలయచూచినట్లు రంగాచారి చూచి, ఉన్నవాళ్ళల్లో ప్రశ్నార్థకాలు రాబోవడం గుర్తించి, గొంతు సవరించుకుంటూ :

"...పూరి వాసు ఆయన్ను భిక్షకు పిలిచే రూ. ఈయన్ని ...వడం ఊళ్ళో చిన్నవాళ్ళు పెద్ద మొఖాసాదార్లు, జమీందార్లు వళ్ళి సత్కారాలు చెయ్యడం, రోజూ ఉ. సవత్సార సభలకు వెళ్ళడం జరుగుతూ నే వుండేవి... [illegible] మాత్రం వెళ్ళలేదుట. దాంతో కోపం వచ్చి ఆయన కొడుకులకు ప్రయోగం చేసేట్ట ఈయన"

"ఈయనే!" అన్నాడు ఓ శ్రోత ఆశ్చర్యం ప్రదర్శిస్తూ.

"సన్యాసులం స్వాములవారం అంటూ జంధ్యాలు తెంపుకున్నంత మాత్రాన కాంతం వుండటండి? వీళ్ళందరూ విశ్వామిత్ర దేవతోపాసనో చేసేవాళ్ళే. అందులో ఈయన పెద చెయ్యేనట కూడాను."

"అలాగా! తర్వాత..."

"ఊరిపెద్దకూడా మంత్ర శాస్త్రంలో విధే అవడంమూలాన్ని అవన్నీ తిప్పుకున్నాడు. కీలకం తెలిసినతర్వాతే ఉదయం ప్రతిరోజూ వెళ్ళినచోట కాశీకు స్నానానికి వెళ్ళేసుట. ఆరోజు స్వాములవారు తటస్థపడ్డారుట అక్కడ."

"భలే బావుంది...ఏం జరిగింది?"

"ఒంటికాలుమీద లేచి 'ఏమయ్యా! ఊరి పెద్దవని నా విగ్రహీగిపోతున్నావు? ఊళ్ళోకి వచ్చేను కదా గౌరవించవక్కరలేదూ? ఏం చూసుకుని ఇదంతా? చూస్తున్నావుగా ఫలితం?' అని హావాహాటలూ అన్నాడట.

ఆగనమాత్రం చిరునవ్వు నవ్వుతూ 'అనుగ్రహించకండి. మీకు ఈ వూళ్లో అమర్యాదచేసి పంపించాలన్న భావం లేదు. ఆ గౌరవం మీమీద నాకు వుండనేవుంది. కాని, నేను నమస్కారం పెట్టడం మీకు శుభంకాదు' అని సవినయంగా విన్నవించుకున్నాడుట.

సూర్పరాజు మధ్యలో అందుకుంటూ "మా బ్రాహ్మలు భలేవారయ్యా! తడిగుడ్డలతో గొంతులు కోసేస్తారు!" అని మీసం దువ్వుకున్నాడు. అవునన్నట్లు చినరెడ్డి తల వూపేడు.

"వెపవులంమాత్రం కాము రాజుగారూ!" అని నక్క వినయం నటించాడు రంగాచారి.

"తర్వాత ఏమో నిక్కచ్చిపుమాటలు అనడంతో ఆయన, 'దయవుంచి మీ దండం అక్కడ నిలబెట్టించండి' అని అనడం స్వాములవారు కాశీకత్తుంలోని ఇసికలో గుచ్చి దండాన్ని నిలబెట్టడం జరిగింది.

ఓసారి సూర్యనమస్కారం చేసి, మూడు సార్లు చేతులు జోడించి ఆ దండానికి ప్రదక్షిణం చేసేడుట ఆయన. మూడోసారి ఆఖరు అయీ అవనంతోటే..." ఆగిపోయేడు రంగాచారి.

శ్రోతలంచి "ఏం జరిగింది? వింతగా వుందే! ఎంతెంత పెద్దవాళ్ళు నివురుకప్పిన నిప్పుల్లావున్నారో!" అన్న ఆతృతలో కూడిన కుతూహలం హెచ్చిపోయింది. ప్రశ్నలు వ...లే అయ్యేయి. ఇది రంగాచారి వాగాటికి-ఓ పూలమాలే కాగా, ఓ సారి దర్పంగా పిసూ, కండువా సర్దుకున్నాడు.

గొంతుక సవరించుకుంటూ—అంగన్యాస

**బహుమతిపొందిన నవల**

# ★ సమర్పణ ★

చెయ్యాలన్న సంకల్పంతో ప్రతీ సంవత్సరం అతనిని కూడా తీసుకువెళుతూ పండితులమధ్య పరిచయాలు చేయిస్తూ, వాగ్వాదాల్లో పాల్గొనేస్తూ, ఇచ్చే ప్రతి సంవత్సరపు బహుమతులకు వడ్డీ అన్నట్లు శ్రీ వరహాలమ్మగారివద్ద అదివాలు గణింప చేస్తుండేవాడు సోమయాజి. అవి అతను పుచ్చుకుంటున్నప్పుడు పొంగి పోయేవాడు. దీనికితోడు, పిలసండితులు, కాశీనుంచి తిరిగివచ్చినవాళ్ళు ఆశీశులు అవడం వార్షిక పటీల్లో తమ పేరుకూడా వ్రాయించండి అని ప్రాధేయపడడంతో సోమయాజికి విర్ర విగినట్లే అయ్యేది.

అంతన్నీ పుచ్చుకుని ఆశీర్వదించి దేవిడీలోంచి వచ్చేస్తూంటే వరహాలమ్మగారికి పెద్దవయస్సు వచ్చేసింది. ఈవిడ, తదనంతరం ఆ ఆంగ్లభాష చదువుకున్న కోడలు ఈ సంస్థానపు మర్యాదలను కాపాడి పాటిస్తుందా అన్న సంశయం కలిగేది సోమయాజులుకి. ఆవిడ జీవితాంతంతోటే తన ఉన్నత స్థితి అనికూడా అనిపించేది. దాంతో కొంత దుఃఖంకూడా వచ్చేది. వెనువెంటనే వసుపతి గుర్తుకు వచ్చేవాడు.

అటు స్వాములవారిని ఊరుదాటించి వచ్చినతర్వాత, ఆయన ఊళ్ళోవుండగానే తనను న్యూనతిపరచాలని రెడ్డిప్రభృతులు ఎదురుభిక్షచేసి ఆక్రమించడంవల్ల కలిగిన నిందని పోగొట్టుకోవాలన్న తహ తహ ప్రారంభమైంది. కోడలికి పునర్వివాహం చేయాలని కొందరు రహస్య ప్రయత్నాలు చేస్తున్నట్లు అపనింద ఒకటి వేసి అందుకు ప్రతిక్రియగా స్వాములవారిచేత ఆంక్ష విధింపచేయవలెనని కుట్రకూటం ఖరారు చేయించుకోవడం సోమయాజి మనస్సును వికలం చేసేసింది. ఇదిచాలదేమో అన్నట్లు, ఇంట్లో అవధాని రగిల్చే నిప్పు కారణంగా ఇంట్లోనే కొందరు కోడలివైపూ మరికొందరు తనవైపూ విడిపోవడం కూడా మనస్సును కలచివేసింది.

ఏ విషయాలు ఎలావున్నా, తను తనువు చాలించే పర్యంతం ఈ అగ్నికి చెద పట్టకూడదు అన్న పట్టుదలతోనే వున్నాడు. పైగా రాజా, కర్త, చారి వగయిరాలు స్వాములవారి రాకతో, 'నువ్వెంత' అన్న ధోరణిలో పడడంవల్ల, వసుపతి తన పట్టుదల నిలబెట్టగలడా అన్న బెంగకూడా పట్టుకుంది.

ఈతిబాధలు ఇల్లా కందిరీగల గుట్టలా శాంతం లేకుండా చేసేటప్పుడే, ఉలాం సంస్థానంనుండి ఆహ్వానం వచ్చింది. కొన్నాళ్ళు మనస్సు అన్యథా త్రిప్పితే మంచిదనుకుని సోమయాజి, పత్నీ సమేతంగానే బయల్దేరేడు వసుపతిని వెంటబెట్టుకొని. చివరిసారి కావులుతప్పే అన్న పరిస్థితి కలగడంవల్లనే ప్రయాణమయ్యేడన్న వదంతిని బాగా వ్యాపింపచేసేరు ప్రతిపక్షులందరూ. సోమయాజి ప్రయాణం వార్తవిని వూరంతా అట్టుడికినట్టుడికిపోయింది.

ఒకళ్ళిద్దరు శ్రీపతిని నిలబెట్టి అడిగేరు. "ఉల్లాంవారు ఆహ్వానించేరు. లింగ ప్రతిష్ఠ చేసారుట" అని చెప్పినా, అవహేళన ధోరణిలో అందరూ యేవో ఏదో అన్నారు. దాంతో ఏం మాటాడలేక లోలోపలే శ్రీపతి కుమిలిపోయ్యేడు.

అన్నిటికన్న ఆగోజు రంగాచారి వీధి మొగలోనే "ఏమండీ! సంబంధం కుదిరిందా?" అని ప్రశ్నించాడు.

"సంబంధం ఏమిటి?" అని తెలబోతూ ఎదురుప్రశ్న వేశాడు

"నవ్వుతూ "అంత గోప్యం ఎందుకూ? కోడలికి పునర్వివాహం చెయ్యాలని సంబంధాలు మీతమ్ముడు వెతుకుతున్నట్టుగా...?"

"ఒట్టి అబద్ధం! మీ పుకారు మీరున్నా! విధవ ముండకి పెళ్ళేందుకూ? శాస్త్రాలు ఒప్పుతాయా?"

"ఒప్పుతాయి స్వామీ! మన అవసరం వచ్చినపుడు, సూత్రాలు వేరుగా తియ్యవచ్చు; కొత్త భాష్యాలు చెప్పవచ్చు. ఏమంత తొందరవచ్చి పుట్టి మునిగిపోయిందని మీ నాన్నగారు స్వాములం వారిని పిలి

పించి భిక్ష చేయించేరు? ఇందుకే గా? వెలి వెయ్యకుండా ఉంచడానికే గా..."

కోపంవచ్చి శ్రీపతికి: "ఏయ్! రంగాచారీ! పిచ్చికూతలు కూసేవంటే......! అని అంటూ ఇంకా ఏ మనాలో తెలియక దర్భపోచలు ఓసారి సవరించుకుని గబగబా వెళ్ళిపోయేడు.

వెనకనుండి రంగాచారి పొట చెక్కలయ్యేట్లు నవ్వాడు. ఆ నవ్వు అతణ్ణి శూలాలా గుచ్చుకొని బాధ పెట్టింది. అంతే గాకుండా ఎదురుగా సూరపరాజు, రెడ్డి ప్రత్యక్షమయ్యారు. సూర్రాజు:

"ఏమండి! మాతో చెపితే మేమూ సంబంధాలు వెతికి, అంచీమీద చేర్చియ్యం?" అన్నాడు. దానికితోడు రెడ్డి "మాలాంటి అబ్రాహ్మణ కుటుంబాలకి పెద్దలమని చెప్పుకుంటూ గడ్డి తినిపించటానికి తయారవుతారు. ఇప్పుడు మీకే తే అవేమీ వుండవు కాబోలు! మర్చిపోకండే స్వాములు వారు తైతక్కలాడిసారు జాగ్రత్త!!" అన్న మాటలు శ్రీపతిని మరీ కృంగ తీసేయి.

ఆ విసుగులో వెళ్ళి అతను ఇంట్లో కాలుగాలిన పిల్లిలా ఎగిరిపోయి ధూం ధాం చేశాడు. నానా మాటలు అన్నాడు—పెంకులు ఎగిరేపోయేయి.

అవధాని, శచి, శ్యామల, కాంతమ్మ శ్రీపతి కురిపించిన ఈ అకాల వర్షానికి ఆశ్చర్యపోయేరు. ఏం జరిగింది అన్నది సంశయం అయ్యింది.

అవధాని నెమ్మదిగా "ఏం జరిగింది అన్నయ్యా!" అన్నాడు, ఉధృతం తగిన తర్వాత.

"శచి! ఇల్లా రా!" అన్నాడు శ్రీపతి

కాళ్ళు వణుకుతుంటే ముసుగు సవరించుకుంటూ అడుగులు వేస్తూ వచ్చి గుమ్మందగ్గిర ఆగిపోయింది.

"ఏమే! పెద్దలు పుడుతున్నాయా? నువ్వు మళ్ళా పెళ్ళిచేసుకుంటానని అన్నావుటకా ఏం? నిజమేనా?"

అవధాని వెంటనే అందుకుని "ఏం తప్పు?" అన్నాడు సవాలుగా.

ఒక్కసారి ఉలిక్కిపడాడు శ్రీపతి. వెంటనే త్రాచుపాములా లేచి "ఎవరి ఇంటి పంచనివుండి మాటాడుతున్నావో తెలుసునా?" అన్నాడు.

"తెలుసు. తెలిసివుండే మాట్లాడుతున్నాను. పైగా ఒకే కడుపున పుట్టి చీమూ నెత్తురూ పంచుకున్న నాయినతో నే మాట్లాడుతున్నాను"

"ఆ! అదెప్పటికీ జరగదూ? నాన్నా, నేను, అన్నయ్య వున్నంతకాలం అది జరగదు; జరగనివ్వం, అటువంటి ఆశలు పెట్టుకోవడం వృథా."

శ్యామల చీర సర్దుకుంటూ: "ఎందుకాదూ! మీలాంటివాళ్ళువుంటే జరగక పోతేసం ఒక లేకొంగు. ఊరేసుకోవలసి వస్తుంది శచిలాంటి ఆడాళ్ళంతా! నోడబుట్టిందే, ముక్కు మొఖం అంటే ఏమిటో తెలియదే! దానిమీదనా మీసవారీ! ఏం చూసుకుని, అసలే నడుం విరిగిపోయిన దానిమీద వేసున్నావ్ మరిద్దీ!" అని అనేసింది.

గతుక్కుమన్నాడు అవధాని. శచిమానం, వదినగారి దుఃఖాయింపు, తమ్ముని పెనసరం మాస్తే గుండె దిగాలుమంది. ఉపవాసాలతో ఆచారాలు, మడులు, పూజలు అలవాటుపడి నిస్సత్తువై పోయిన శరీరం తిరుగుబాటుకు చైతన్యానికి ఒప్పుకోలేదు. నాటికి సమాధి కట్టిన వటచైతన్యం పొందలేదన్నట్టే 'నాన్నగారు, అన్నయ్యలేర నేగా ఇలా బరిదెగించి పోయి మాట్లాడుతున్నారు. ఈపంచలో ఇటువంటి ప్రస్తావన ఎప్పుడేనా వచ్చిందా? హోతస్సు స్వీకరించిన మీరందరూ కూడా ఇలా నైతిక పతనం అవడం తలకాయ తీసేసినట్లె వుంది..."

"ఎందుకన్నయ్యా! అవన్నీను నీ అంతట నువ్వు శచి ముఖం చూచి చెప్పు. ఏం తప్పు చేసిందని దానికీ శిక్ష?"

కాంతమ్మ పైకివస్తూనే బెల్లంకొట్టిన రాయిలా కూర్చున్న భర్తని చూచి "మాట్లాడరేం అండీ" ఆ వయస్సులో అది ఉంచవలసింది ఆవిధంగానా? నాటివాళ్ళంతా పసుపు కుంకుమలో వుంటే వ్యంజనం లేని ఉప్పుపిండి, ఏకాదశులు, నిత్యస్నానాలు సాగిస్తూ వంటింట్లో పడి ఉండవలసినదేనా?"

శ్రీపతి తెములుకోలేక "ఎవరికర్మ వారు..." అని వూగుతున్నాడు.

"మా చెప్పవచ్చేరు శిరంగనీతులు. ఆ రెడ్డికూతురు లేచిపోతే వెలి అంటూ నానా హంగామా చేసేరు! దాన్ని ఏం చెయ్యగలేరు? దానికాపురం చెడగొట్టేరా?

(55-వ పేజీ చూడండి)





జంగందేవర జ్యోతిషం

—ఫొటో: సోమయాజులు.]




# ప్రజాస్వామ్యానికి అడ్డంవస్తున్న ప్రైవేటు రంగం

ప్రధానమంత్రి ఎన్నటికీ పాతబడనిమనిషి. ఆయన చెప్పినదేదైనా వినదగినదీ, ఆలోచించదగినదీని. ఇప్పటికి పదేళ్లనుంచీ ఆయన ఏం చెప్పినా పత్రికలలో పతాక శీర్షికలలో పడుతూనే ఉంది. ఇటీవల పత్రికా విలేఖరుల గోష్ఠిలో ఆయన చెప్పింది వింటుంటే ప్రాణం లేచివచ్చింది.

భారత దేశంలో ప్రజాస్వామ్యాన్ని కంటికి రెప్పలా చూసుకునేవారిలో ప్రధానమంత్రి ప్రధానులు. కనకనే కేంద్ర ప్రభుత్వంలో మంత్రిగా ఉన్న శ్రీ మనూభాయ్ షా ఈమధ్య ఇరుకులో పడ్డప్పుడు ప్రధాని వచ్చి ఆదుకున్నారు. రక్షణశాఖ కుదుర్చుకున్న ఒప్పందాల విషయమై రగడ జరగటం పాఠకులకు తెలిసినదే. రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కె. రఘురామయ్య పరిశ్రమల శాఖలో మంత్రి శ్రీ మనూభాయ్ షా ఒకరన్నదాన్ని మరొకరు కాదంటూ చేసిన ప్రకటనలను ప్రధాన మంత్రికి ఎవరో జ్ఞాపకం చేశారు. వాణిజ్యసుంకాల సవరణ బిల్లు పై మాటాడుతూ శ్రీ మనూభాయ్ షా, "మోటారుకార్ల పరిశ్రమ మన దేశంలో త్వరగా అభివృద్ధి చెందకపోవటానికి కారణం ప్రభుత్వం తగినంతగా విదేశీ ద్రవ్యం ఇవ్వకపోవటమే' అని అన్నారు. "మోటారు కార్లలో స్వదేశీ తయారీ భాగాన్ని ఎక్కువ చేసేందుకు గాను పారిశ్రామికులు పనిముట్లు, యంత్రాలు తెప్పించుకునేందుకు అవసరమైన విదేశీ ద్రవ్యాన్ని కొన్ని నెలల క్రితం దాకా మేము సప్లయి చేయలేకపోయాము," అని ఆయన తెలిపారు.

విదేశీద్రవ్యం కొరతగా ఉన్నప్పటికీ ముఖ్యమైన మోటారుకారులో స్వదేశీ తయారీ భాగం 1958 ఏప్రిల్ లో ఈ విధంగావున్నటు వాణిజ్య, పరిశ్రమలశాఖ తెలియజేసింది:

హిందుస్థాన్ అంబాసడర్ కారులో నూటికి 60 వంతులు, ఫియట్ '1100' లో నూటికి 87 వంతులు, స్టాండర్ వాన్‌గార్డ్ లో నూటికి 88 వంతులు, స్టాండర్డ్ '10' లో నూటికి 80 వంతులు.

కాని మోటారుకార్ల పరిశ్రమ ఈ పదేళ్లలోనూ దేశంలో నూటికి 30 వంతులకంటె ఎక్కువ తయారు చేయలేక పోయిందని రక్షణశాఖ ఉపమంత్రి ఉద్ఘాటించారు.

"ఈ పరస్పర విరుద్ధ ప్రకటనలు మీరు చూశారా? ఇవి కాబినెట్ ప్రభుత్వపద్ధతికి విరుద్ధం కావా?" అని ప్రధానమంత్రిని అడిగారు.

కాబినెట్ పద్ధతికి అవి విరుద్ధమని వాటి మొహానే తెలిసిపోతోంది. రక్షణ ఉపమంత్రి ప్రకటన ప్రధానమంత్రి రక్షణ శాఖ పై ఆధిపత్యం వహిస్తున్న రోజుల్లో ఆయన అనుమతిమీద చేసిన ప్రకటనే. ఇక మనూభాయ్ షా ప్రకటనసంగతి. ఆ ప్రకటన ఏమిటో చూసినదాకా దాన్నిగూర్చి తానేమీ చెప్పలేనని ప్రధానమంత్రి పత్రికావిలేఖరులతో చెప్పారు. అంటే శ్రీ షా ప్రకటన ప్రధానమంత్రి ఆమోదం పొందలేదన్నమాట. అదలా ఉంచుదాం. విదేశీ ద్రవ్యాభావం ఎప్పుడు ఏర్పడింది? 1958 లో. అంతకుముందు ఇష్టం వచ్చినట్లు దిగుమతులు తెప్పించుకోవటంవల్ల యేర్పడింది. కనక మోటారుకార్ల పరిశ్రమకు అంతకు ముందు 8 ఏళ్లలోనూ విదేశీ ద్రవ్యాభావం లేదన్నమాటేగా? ఇక పోతే దేశంలో తయారయ్యే భాగాలు అంటే ఏయే భాగాలో మనకి తెలియదు.

కార్ల మన్నిక, ధరల సంగతి, అవి సరిగా పని చేస్తున్నాయా లేదో అన్న సంగతీ వాణిజ్య, పరిశ్రమల శాఖ సహజంగానే పట్టించుకోదు. మంత్రిగారు ఇలా చెప్పారు: "ఏడాదికి కనీసం లక్ష కార్లయినా ఉత్పత్తి చేయకపోతే ఏ దేశానికీ ఈ పరిశ్రమ గిట్టుబాటు కాదు. మన దేశంలో ఏడాదికి 32 000 కార్లు మాత్రమే తయారవుతున్నాయి."

1956 సం॥పు నివేదికలో వాణిజ్యసుంకాల సంఘం ఇలా ప్రకటించింది :—

"దేశంలో ప్రయాణసౌకర్యాలను అభివృద్ధిచేయుటానికీ, కారు పరిశ్రమకు ప్రోత్సాహంకలిగించటానికీ కార్ల వాడకాన్ని ఎక్కువచేయుటం అవసరమని ఈ సంఘం భావించింది. ఇందునిమిత్తం మోటారుకార్ల పన్నులవిచారణ సంఘపు సిఫార్సులను అమలుచేయాలని ఈ సంఘం ప్రభుత్వానికి సూచించింది. ఈ దేశంలో తయారైన, లేక త్వరలో తయారుకానున్న కొన్ని ఆటో

# ★ న్యూఢిల్లీ లేఖ ★

మొదెల్ భాగాలమీద నూటికి 94½ దాకా సుమతిపన్నును, మరికొన్ని భాగాలమీద నూటికి 68 దాకా, ఇంకా కొన్ని భాగాలమీద నూటికి 81½ దాకా దిగుమతిపన్నును విధించటంవల్ల మోటారుకార్ల పరిశ్రమకు సహాయం జరగకపోగా, వాటిధరలు అమితంగా పెరిగిపోవటం సంభవించిందనికూడా సంఘం అభిప్రాయపడింది. అందుచేత అన్నికార్ల భాగాలమీద నూటికి 40 వంతుకే దిగుమతిపన్ను విధించటం మంచిదని ఈ సంఘం సిఫార్సుచేసింది."

ఈసిఫార్సును ప్రభుత్వం అమలుచేసింది. దీనివల్ల మోటారుకార్ల ధరలు తగ్గుతాయని అప్పటి వాణిజ్య, పరిశ్రమలశాఖ మంత్రి లోక్ సభలో వాణిజ్య సుంకాలబిల్లును ప్రతిపాదిస్తూ హామీ ఇచ్చారు. కాని ఆయన ఆశించినట్లు జరగలేదు.

వాణిజ్య సుంకాల సంఘం తన నివేదికలో ఇంకా ఇలా తెలిపింది:- మోటారుకార్ల కంపెనీలలో దేని కెంత ఉత్పత్తి శక్తి ఉన్నదనే విషయాన్ని సాంకేతికంగా పరిశీలించటానికి మాకు వీలుపడలేదు. నిజానికి చాలా కంపెనీలు ఉత్పత్తి చేయగలిగినదానికంటె తక్కువ ఉత్పత్తి చేస్తున్నాయి."

ధరలను ఒక స్థాయికి పడిపోకుండా చేయటంకోసమే ఉత్పత్తి చేయగలిగినంతా చేయటంలేదని కొందరు ఆరోపిస్తున్నారు. ఈనాటి పరిస్థితినిబట్టి ధరలను తగ్గించి ఉంచితే కార్ల వాడకం తప్పక పెరగగలదు.

ఏడాదికి లక్ష కార్లు తయారుచేసినప్పటికీ ధరలు మాత్రం తగ్గవని కొందరు భావిస్తున్నారు. ఎగుమతులను ప్రోత్సహించాలనే విధానంవలన ప్రజలకు పెద్దదెబ్బ తగులుతోంది. ఈ విధానం లేనప్పుడు ప్రజలు సుఖపడ్డారనికాదు. ఒకానొక సందర్భంలో వాణిజ్య సుంకాల సంఘం రక్షణను విరమింపజేయాలని సూచించినప్పుడు రక్షణ సుంకాలను రివిన్యూ సుంకాలుగా ప్రభుత్వం వెంటనే మార్చివేసింది. ఈ రివిన్యూసుంకాలు కూడా నామమాత్రపు సుంకాలేగాని వీటివల్ల ఒరిగేదేమీ లేదు. ఎందుకంటే దిగుమతులను పూర్తిగా నిషేధించారు. నిజానికి విదేశీ ద్రవ్యం కొరత ఏర్పడక ముందు కూడా దిగుమతులను నిషేధించటం ఒక్కటే భారతీయ పరిశ్రమకు రక్షణమార్గంగా ఉండేది. విదేశీ ద్రవ్యం కొరత ఏర్పడిన తరువాత, ఈ కొరతను ఎదుర్కొని విదేశీద్రవ్యం సంపాదించుకోవటం కోసమని భారతీయుల తలకు మరింత బరువు ఎత్తారు. ప్రజలకు కాస్త సౌకర్యం కలిగించాలని ఎవరికీ తోచలేదు. ఉదాహరణకి ధరలు పెరగడం మూలంగా ప్రజలకు చక్కెర అందుబాటులో లేకుండాపోయింది కాని ఈసంగతి ఏ అధికార ప్రకటనలోనూ ఉండదు. బహుశా అధికారులకు తక్కువ ధరలకే చక్కెర అందుతుందేమో.

రక్షణ మంత్రి శ్రీ కృష్ణమీనన్ తెగించి తెరాలు వదుల్చుకోటానికి ఇదే కారణం. దేశంలో తయారయే కార్లు అంత బాగా పని చెయ్యనప్పుడు, బాగామన్నప్పుడు అంతంత ధరలు అనవసరమని ఆయన వాదించారు. కాని తన వాదనను వాణిజ్య, పరిశ్రమలశాఖ చేత ఒప్పించలేక పోయారు. ప్రైవేటు వ్యాపారస్థులు పెట్టిన ధరలకంటె తక్కువ ధరలకు మోటారుట్రక్కులు తాను తయారు చేయిస్తానని, ఏడాదికి లక్ష కారు తయారు కావలసినఅవసరం లేకుండా నేరుగా తయారు చేయించగలనని ఆయన అన్నారు. అసంభవమని శ్రీ మనూభాయ్‌షా అన్నారు. సంభవమేనని చేసి చూపిస్తానని శ్రీ మీనన్ సవాల్ చేశారు. ఇదంతా చూసి ప్రైవేటు వ్యాపారస్థులు "మమ్మల్ని నాశనం చెయ్యకండి. మీరు విడిభాగాలు ఉత్పత్తి చెయ్యండి. మేము అసెంబ్లింగ్ పనంతా చేస్తాము," అని ఆందోళన చేస్తున్నారు.

"మీరేం చెయ్యనక్కరలేదు. నా అసెంబ్లింగ్ పని నేనే చేసుకుంటాను" అని శ్రీ కృష్ణమీనన్ అంటున్నారు. ప్రధాన మంత్రి శ్రీ మీనన్ నే సమర్థించారు ఆయన ఇలా అన్నారు:

"చవకగాను, చక్కగానూ చెయ్యగలిగిన సందర్భాలలో ప్రభుత్వరంగానికే పని అప్పజెబుతాము. ప్రయివేటు రంగం లక్షణంగా పనిచెయ్యాలనే మేము ఆశిస్తున్నాము. ప్రైవేటు రంగంపై దెబ్బ తియ్యాలని మా అభిమతం కాదు. కాని ప్రైవేటురంగం ప్రభుత్వరంగానికి వ్యతిరేకంగా పనిచేసినప్పుడు ఎవరైనా మందలించటం సబబే"

ప్రధానమంత్రి అక్కడితో ఆగలేదు. "ప్రజాస్వామ్య విధానానికి ప్రైవేటురంగం అడ్డంవస్తోంది" అని ఆయన నిర్మొహమాటంగా చెప్పేశారు. ప్రైవేటురంగం అంటే ఆయన ఉద్దేశంలో ఒకరికొకరు పోటీగా ఎవరికివారుగా వ్యాపారం చేసుకుంటున్న వ్యాపారస్థులు కాదు. ఆయన ఉద్దేశం సుసంఘటితులైన పెద్ద పారిశ్రామికులని.

అయితే ఈ పెద్ద పారిశ్రామికులకు మనసుఇచ్చి వారినంత పెద్ద చేసిందెవరు! బాగా ఆలోచిస్తే ప్రభుత్వమేనని స్పష్టంగా వుంటుంది; ప్రభుత్వం స్వదేశీ వ్యాపారానికి ఇచ్చిన రక్షణ వదలే అని తేల్తుంది. ★




# అందరినీ ఆకర్షిస్తున్న ఆంధ్ర వారపత్రిక

ఆంధ్ర సచిత్రవారపత్రిక స్వర్ణోత్సవము జరుపుకొనుట ఆంధ్రులచరిత్రలోను, ఆంధ్రదేశపత్రికల చరిత్రలోను ఒక గొప్ప విషయము.

పూజ్యులు, దేశోద్ధారకులు, మహాదాతలగు శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు దూరస్థదేశము బొంబయిలో (1908లో) నున్నప్పుడే ఆంధ్రుల అవసరములను గుర్తించి, ఈ పత్రికను స్థాపించి, క్రమేణ దానిని మద్రాసుకు మార్పించి, వారపత్రికతో పాటు దిన పత్రికను "భారతి" మాసపత్రికను స్థాపించి ఆంధ్రోద్యమమునకును, జాతీయోద్యమమునకును మహోత్కృష్టమగు సేవ యొనర్చిరి. ఈ సేవ నిజముగ అగణితమే. చాలకాలము వీరి "ఆంధ్రపత్రిక" ఒక్కటే ముక్కోటి ఆంధ్రులకు ఏకైక దినపత్రికగా నుండెడిది. ఈ సందర్భమున ముఖ్యముగ పంతులుగారిని స్మరించుట అవసరము.

ఇక యిప్పటి వారపత్రిక విషయమై, నేను సాధారణముగ (ఒక్క సినిమావార్తలు దక్క) పత్రికనంతయు ఆమూలాగ్రముగ చదువుచుందును. ఇందు మీ ఢిల్లీవిలేఖరి "శ్రీకృష్ణ"గారి లేఖలు ప్రశంసనీయములు: వీరి రచనలలో రాజధానియందలి ముఖ్యవిశేషాలు, కేంద్రప్రభుత్వములోని అవకతవకలు దుబారాఖర్చులు, పక్షపాతములు, విదేశములలో వీరి యాత్రానుభవములు, బహువిపులముగను, చదువరులకు కనువిప్పుగను నుండువనుట అతిశయోక్తి కాదు. ఇట్టి వ్రాతలే ఏ ఆంగ్లమందో, ఏ అమెరికన్ 'కాలమిస్టో' యే విదేశీ పత్రికలలోనో వ్రాసి ఈపాటికి బ్రహ్మాండమంతా దద్దరిల్లిపోయే దనుకుంటాను.

ఆమధ్య కాంబోడియా మున్నగు విదేశములలో సంచరించి వచ్చిన ఒక విలేఖరి (శ్రీ కొవ్విడి లక్ష్మన్న) చక్కని వ్యాసములు వ్రాశారు. ఆ వ్యాసాలనుబట్టి, ఇక్కడి మన భారతీయులకును, భారతీ విజ్ఞానమునకును ఆగ్నేయఆసియావాసుల జీవితమునకును ఎట్టి సన్నిహిత సంబంధములున్నవో ద్యోతకమగుచున్నవి. కేవలము వాదసంబంధములే కావు. ఇచ్చటి మన హైందవ బ్రాహ్మణ సంప్రదాయములు, ఆచారములు, అచటి ప్రజాజీవితములో యెంత గాఢముగా పాతుకొనిపోయినవో మనము గ్రహింపగలము.

**గుమ్మడిదల వెంకట సుబ్బారావు**

ఇక కథల విషయమై నెలనెలకు పదేసి, ఇరవైయేసి కథలు, కథానికలు ప్రచురించవలసినప్పుడు అన్ని కథలు ఒకే ఉన్నతస్థాయిలో నుండుట దుస్సాధ్యము. అయినను క్రమముగ వీటిస్థాయి హెచ్చుచుండుట ముదావహము. ఈరీతిగ తెలుగు కథకులకు పత్రిక ఇచ్చుచున్న ప్రోత్సాహము మెచ్చుకొనదగినది. ఈ కథలలో 'ప్రాచీనగాథలు' కొంతవరకు మన పూర్వవాసనలుగల అస్మదాదులకు ప్రత్యేకముగ ఆహ్లాదకరములు.

పత్రిక మన మహిళాలోకమునకు చేయుచున్న మహోపకారము మరువరానిది. వివిధ శీర్షికలక్రింద ముఖ్యంగా స్త్రీలకు సంబంధించిన అనేక సమస్యలనుగురించి, అందులో స్త్రీ రచయితలే సుదీర్ఘమైన చర్చలు సాగించుటకు మీరు కల్పించిన సావకాశము బహు ప్రశంసనీయము.

రాజ్యాంగ శాసనాలలో, పౌరహక్కులలో, సంఘ మర్యాదలలో, భగవద్గీతదగ్గరనుంచి మన రాజ్యాంగంవరకు అన్ని గ్రంథాలూ "లింగభేదము లేదు; సమత్వం కావాలి" అని చెప్పేవే కాని, ఆచరణలో మాత్రం 'శాటాకులలోన వ్రాసిరి...' అన్నట్లు ఉంటున్నది ఇప్పటి యథార్థ పరిస్థితి. ఈ స్థితి నిజంగా మారాలంటే, 'ఆత్మైవహి ఆత్మనో బంధుః' అన్నట్లు మన మహిళలలో నుంచే అవిభేద్యమైన నవచైతన్యం రావాలి. అందుకొరకు మీ వారపత్రిక ఇటీవల ఇచ్చే దోహదము ప్రశంసనీయమైనది. ఈ విధంగా తర్జనభర్జనలు చేసుకొని, యిటు సంఘంలోని దుస్థితి, అటు ప్రపంచ పరిస్థితులు, అసలు శాస్త్రం చెప్పిన మూలమాత్రాలు గ్రహించగలిగిన మహిళలు ప్రతి రాష్ట్రానికి పదిమందిఉంటే, దేశాన్నంతనీ మార్చివేయవచ్చునని నా అభిప్రాయం. ఈ సాంఘిక విప్లవానికి పత్రిక చాలావరకు

# మేము మా వారపత్రికా

చేయూత యిస్తున్నందుకు మిమ్మల్ని ప్రత్యేకంగా అభినందించవలసియున్నది. ఇందులో యెవరిభావం మంచిది? ఎవరిది చెడ్డది? అనేది కాదు—ఇప్పటి సమస్య, ఉభయపక్షాలలోను సమగులగు రచయితలు (మహిళలు) తయారు కావడమే మనకి ప్రధానం. సముద్ర మథనం అయితేకదా! అమృతం రావడానికి!

ఆముష్మిక మంత్రాలనుగురించి మీ పత్రిక ప్రచురించిన వ్యాసాలలో చాలా భావగర్భితమైనవి, ప్రజోపయోగమైనవి అనేకం ఉన్నాయి.

ఇక ఆఖరివిషయం — పిల్లలగురించి. మీ రీటీవల ప్రారంభించిన బాలలసంఘం మాట అటుంచి, మీ "బుడుగు" గురించి మాత్రం ఒక్కమాట చెప్పకతప్పదు. వాడి తిప్పాదియ్యా! నా చేతిలో అరడజన్ రాజ్యాల అధికారం ఉంటే, వాడి మాటలకీ, చేష్టలకీ, వాడికి రెండు "నోబెల్ బహుమతులు" యిప్పించేవాణ్ణి! అంటే వాడి కోతాటి—కీ. గానపనూ వాంటకోతాటిన్ని! అన్నట్టు వాళ్ళ పెళ్ళికి నాతో శుభలేఖ పంపమనండే! చదువుకేమిలెండి ఈ వెధవ చదువులు—వాడే చెప్పి పారేస్తాడు—డెబ్భ చదువులు—కోటిమందికైనాను!

అట్లాటి "బుడుగు"ను సృష్టించిన "ఆంధ్ర (వార) పత్రిక" నిజంగా ధన్యురాలు. ఆ బుడుగుకీ, వాడికి కాబోయే పెళ్ళానికీ, మీ పత్రికకూ కూడా నా ఆశీస్సులు, అభినందనాలున్నూ!

## మా ఇంటికి కాపీ రాగానే...

### తాడికొండ సామ్రాజ్యము

"పత్రిక ఒక అద్భుతమైన లలితకళాసంస్థ. శిల్పము, చిత్రలేఖనము, సంగీతము, నాట్యము, కవిత్వము ప్రజలకు అందజేస్తుంది. వాటి స్వారస్యాన్ని ఆస్వాదించి అనుభవించి ఆనందించే విధానము నేర్పుతుంది... ప్రజల అభిప్రాయాలు ప్రజలకే వ్యాఖ్యానం చేసి పత్రిక చెపుతుంది. ప్రజల భావాలను మార్చగల నాయకుడవుతుంది పత్రిక. ప్రజలను తీవ్రంగా విమర్శిస్తుంది; ప్రజలను పొగుడుతుంది; బతిమాలుతుంది" అని కులపతి అడివి బాపిరాజుగారన్నారు.

ఈ కార్యాలను టూ. చ. తప్పకుండ ఆంధ్ర సచిత్ర వారపత్రిక నిర్వహించుతుందని మా నాన్నగారు అనేవారు.

ఆయనకు రాజకీయ వ్యాసాలంటే చాల యిష్టము.

ఎప్పుడూ చిరాకుగావుండే మా నాన్న, పత్రిక రాగానే సర్దాగా "పత్రిక వచ్చిందా అమ్మాయి" అని ప్రశ్నించేవారు. వారపత్రిక తెచ్చి యివ్వగానే రాజకీయ వ్యాసాల్ని చదివేవారు. వారికి నచ్చిన వ్యాసాలను కత్తిరించి ఫైలు చేసేవారు. 26-12-51 సంచికలో 'దేశీయ సమస్యలు—పార్టీలు' అనే వ్యాసాన్ని కత్తిరించి బహు జాగ్రత్తగా వుంచారు. ఇప్పటికికూడా 'న్యూఢిల్లీ లేఖ'ను చదివిగాని రెండవ పని గూర్చి పరికించరు మా నాన్నగారు. 'దేశంలోని సమస్యల్ని సునిశితంగా విమర్శించి ప్రజల్ని సక్రమ మార్గాన నడిపించే పత్రిక "ఆంధ్ర పత్రిక" అని వారి అభిప్రాయము. ఈ అభిప్రాయాన్ని మా తాతయ్య, ఆయన మిత్రులు అంగీకరించారు.

* * *

"మనిషికో అభిరుచి. మా అన్నయ్యకు సినిమాలంటే అన్నము కూడ తినడు. ఇప్పటికి కూడా పత్రిక రాగానే సినిమాబొమ్మల్ని చూడనివ్వమని ఒక అభ్యర్థన చేస్తాడు. మా తాతయ్యని. ఆరోజులలో పత్రికలో ప్రచురించిన సినిమా సంగతు

(62-వ పేజీ చూడండి

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘం

GROUP
A లేక B

[సభ్యత్వపు దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు ....
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తిపేరు : ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి: నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము : ....
పాఠశాల పేరు : ....
ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :
అర్జీ :
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు. ఇట్లు

[తేదీ : -1958] (సంతకము)

* మరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

**సంచిక: 21-1-59 | ఈ దరఖాస్తు 24-1-59 నాటికి మాకు చేరాలి |**

# అలంపురం

డా॥ పి. శ్రీనివాసాచారి

తుంగభద్రా నదీతీరాన, కృష్ణాతుంగభద్రల సంగమ స్థలానికి సమీపంలో వున్నది అలంపురం. దీని చరిత్ర చరిత్రకందని కొత్త రాతియుగానికి చెందినదై వుండవచ్చు నని తోస్తుంది. అలంపురానికి సుమారు అరుమైళ్లి దూరములో కూడలి సంగమేశ్వరం వద్ద, ఉప్పలపాడు దగ్గిరా కనిపించే శిథిలాలు, తుంగభద్రా కృష్ణానదుల పొడుగునా కనిపించే శిథిలాలు ఈ ప్రాంతంలోని మానవ నివాస ప్రాచీనతను తెలియజేస్తున్నాయి.

ఈ ప్రాంతంలో శాతవాహన రాజరిక చిహ్నాలు కూడా కానవచ్చాయి. దీన్నిబట్టి ఇంకొ ఒకటిరెండుస్థలాల్లో తవ్వితే మరికొంత చరిత్ర బయటపడవచ్చునని తోస్తుంది. బాల బ్రహ్మేశ్వర దేవాలయంలోని ఒక శిలాఫలకంమీద చెక్కబడిన ఒక శాసనాన్ని బట్టి మొట్టమొదటి చాళుక్య రాజులు యిక్కడ పాలించారని నిస్సందేహంగా చెప్పవచ్చు.

అలంపురంలోని బ్రహ్మేశ్వరాలయ ప్రాకారబంధంనిర్మాణాన్ని సంకల్పించినది రెండవ పులకేశి మునిమనుమడైన రెండవ విజయాదిత్యుడు. శక సం॥ 636 లో ఈ నిర్మాణాన్ని భటపాదుడని బిరుదు వహించిన ఈశానాచార్యుడు నిర్వహించాడు.

క్రీ. శ. 696 నుండి 733 వరకూ పాలించిన విజయాదిత్యునికి సత్యాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ రాజపరమేశ్వరం భటారకుడని బిరుదమువున్నది. తండ్రితాతల క్రింద రణరంగానుభవం, పరిపాలనానుభవం పొంది, సుశిక్షితుడైన తర్వాతనే యితడు రాజ్యానికి వచ్చినవాడు. ఇతని పరిపాలన కాలంలో ఏ విధమయిన అలజడులూ లేకపోవటంచేత, శక్తి సంపద లన్నిటినీ ఆలయాది నిర్మాణాలకే వినియోగించాడు. ఇతని కుమారుడు రెండవ విక్రమాదిత్యుడు (క్రీ. శ. 733-744) కూడా తండ్రి ఒరవడినే అనుసరించాడు. పట్టడకల్లు వద్దగల సంగమేశ్వర దేవాలయం కట్టించినది విజయాదిత్య సత్యాశ్రయుడే. వీటన్నిటిని బట్టి అలంపురంలోని కొన్నికొన్ని దేవాలయాలను విజయాదిత్య సత్యాశ్రయుడు, రెండవ విక్రమాదిత్యుడు కట్టించి వుండవచ్చునని విశ్వసించటానికి ఆధారా లేర్పడుతున్నాయి.

ఈ వశీకాలం మధ్యకాలంలో బాదామి



అలంపురంలోని స్వర్గబ్రహ్మాలయం.



నటరాజ ప్రతిమ.



మహిషాసురమర్దని.

# ★ అలంపురం ★

చాళుక్యులను రాష్ట్రకూటులు ఓడించారు. ఈ రాష్ట్రకూటుల రాజధానిగా ప్రసిద్ధికెక్కిన మాన్యఖేటం (మాల్ ఖేడ్) అలంపురానికి 100 మైళ్ళ దూరంలో ఉన్నది. రాష్ట్రకూటులు కట్టించిన మాన్యఖేట దుర్గ ప్రాకారాలు, ఎల్లోరాలోని కైలాసాలయం, తదితరములైన కట్టడాలు అలంపురంలోని దేవాలయ నిర్మాణ శిల్పాన్ని పోలి ఉన్నాయి. దీన్నిబట్టి కూడా అలంపురం ప్రాచీన శిల్పాల ప్రాముఖ్యం గ్రహించవచ్చును.

అలంపురంలో అనేక నిర్మాణాలు కనిపిస్తున్నాయి. నదీతీరాల్లో, నగర వీధుల్లో ఉన్న దేవాలయాలు, చిన్న చిన్న మంటపాలు, కోటగోడలు ఇంకెన్నో కట్టడాలు ఉన్నాయి. ఈ ప్రాంతంలో తుంగభద్ర కొంచెం ఉత్తరదిశగా ప్రవహిస్తున్నది. ఉత్తరాభిముఖంగా ప్రవహించే నది పుణ్యతీర్థమని మనవారు పరిగణించటంచేత అలంపురం పుణ్యక్షేత్రంగా ప్రఖ్యాతి పొందింది. కాలక్రమాన ప్రజలు దీన్ని దక్షిణకాశిగా పరిగణించారు. సరిగా కాశిలో ఏయే దేవాలయాలు, తీర్థాలు, ఘట్టాలు ఉన్నాయో, అన్నిటికీ అలంపురంలో కూడా ప్రతులు వెలిశాయి.

ఈ విధంగా అలంపురంలో 18 పుణ్యతీర్థాలు 64 ఘట్టాలు ఏర్పడ్డాయి.

అయితే అలంపురానికి ప్రశస్తి తెచ్చినది ముఖ్యంగా 9 బ్రహ్మేశ్వరాలయాలు, అలంపురానికి అరమైలు దూరంలో ఉన్న పాపనాశి ఆలయాలు. పాపనాశాలయాలకే అక్కడ ముఖ్య స్థానమనుకుంటే వాటి నిర్మాణ శిల్పాన్ని బట్టి చూస్తే అవి చాలా తరువాతి కాలంలో నిర్మించబడి ఉండవచ్చునని తెలుస్తోంది.

నవబ్రహ్మేశ్వరాలయాలు బాలబ్రహ్మ, గరుడబ్రహ్మ, స్వర్గబ్రహ్మ, కుమారబ్రహ్మ, వీరబ్రహ్మ, విశ్వబ్రహ్మ మొదలైన ఆలయాలుగా ప్రసిద్ధికెక్కాయి.

వీటిలో బాలబ్రహ్మేశ్వరాలయము ప్రధానమైనది. ఇందులో ఇప్పటికీ పూజా పురస్కారాలు జరుగుతున్నాయి. విమానం చెక్కుచెదరకుండానే ఉందిగాని, పూరవిరాదపూతగా వెల్లవేసినందువల్ల శిల్ప సౌందర్యము మరుగుపడిపోయింది. ప్రధానాలయానికి చుట్టూ కొత్తకట్టడాలు చాలా లేచినందువల్ల లోపలిభాగమూ, ముఖ్య శిల్పాలు కనిపించకుండా పోతున్నాయి. ఆలయాంతర్భాగంలో శిల్పాల మీద పెయింటు వేసి, కుంకుమపూసి చెడగొట్టారు. గాని పూజ జరుగుతున్న విగ్రహాలు అవి ఏవీ చెడలేదు. బాలబ్రహ్మాలయానికి ప్రక్కనే దక్షిణంగా గరుడబ్రహ్మాలయం, దానివెనుక స్వర్గబ్రహ్మ, పద్మబ్రహ్మ ఆలయాలు ఉన్నాయి. స్వర్గబ్రహ్మాలయం శిల్పంలోను, నిర్మాణసౌందర్యంలోను మిగతి వాటికంటె అద్భుతంగా ఉన్నది. స్తంభాగ్రాలపైన చెక్కిన మానవ శిరస్సులు ఉన్నాయి. ఉపరిభాగంలో మానవ రూపాన్ని పోలిన నాగప్రతిమలు లోకప్పుకి అతి సుందరంగా మలచబడ్డాయి. నాగరాజులు, లింగోద్భవమూర్తి, త్రిపురాంతకుడు, నటరాజు, గంధర్వ మిథునాలు మొదలైన ప్రతిమలన్నీ అత్యుత్తమ శిల్పాలయి, నవీనాతీతాన్ని ప్రదర్శిస్తున్నాయి.

నిర్మాణపద్ధతిలో స్వర్గబ్రహ్మాలయానికి, పద్మబ్రహ్మ మొదలైన మరికొన్ని ఇతరాలయాలకు చాలా భేదం ఉన్నది. పద్మబ్రహ్మాలయం ఏర్పాటు చాలా సామాన్యమైనది. మధ్యలో రెండు స్తంభాల వరుసలు ఉన్నాయి. గర్భగుడికి ప్రదక్షిణం చేయటానికి వీలుగా ఆలయ కుడ్యాలవెంట ఖాళీ స్థలం ఉన్నది. కప్పు ఆలయబహిర్భాగం పై భాగాలు, పెద్ద రాతిపలకలతో నిర్మించబడింది. మూలలో ఈ రాతిపలకలకు ఆధారంగా రాతిదూలాలు విమూలగా అమర్చారు.



సూర్యదేవుని విగ్రహం.

స్వర బ్రహ్మాలయంలోని వాస్తుశిల్పం దీనికంటె భిన్నమైనది. తూర్పుగా స్తంభాలతో కూడిన ప్రాంగణం ఉన్నది. మధ్యగా ఉన్న దీర్ఘ చతురస్రాకారపు మందిరానికి నాలుగువైపులా గోడలవెంబడే నడవ ఉన్నది. మందిరానికి పడమటిచివర గర్భగుడి ఉన్నది. గర్భాలయంలో లింగానికి చుట్టూ ఉన్న నాలుగు స్తంభాలు ఈ ఆలయంలోని ప్రత్యేకత. బాలబ్రహ్మాలయానికి ఉత్తరంగా నదిఒడ్డున వరసగా కుమార బ్రహ్మ, అర్కబ్రహ్మ, వీరబ్రహ్మ, విశ్వబ్రహ్మాలయాలున్నాయి. వీటిలో మొదటిది ఇప్పుడు పురావస్తు ప్రదర్శనశాలగా మార్చబడిన తపసిద్ధ మఠానికి ఎదురుగా ఉన్నది. దీనిలోని స్తంభాలు ఆకృతిలోను, శిల్పంలోను ఎల్లోరా, అజంతా స్తంభాలను పోలి ఉన్నాయి. అర్కబ్రహ్మాలయం శిథిలమై ఉన్నది. దీన్ని ఒకప్పుడు మసీదుగా మార్చిన చిహ్నాలు కనిపిస్తున్నాయి. కాని ఎన్ని సార్లు చెల్లవేసినా అందులోని పద్మదళయాలు, స్తంభాలమీద ఉన్న సుందర శిల్పాలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. వీరబ్రహ్మాలయంలో అందంగా జలెడలాగ చెక్కిన శిలావాతాయనం ఉన్నది. ఆఖరిదైన విశ్వబ్రహ్మాలయం, స్వర్గబ్రహ్మాలయం వలెనే అత్యంత సుందరమైన శిల్పకళతో అలరారుతున్నది. ఇందులో నటరాజ ప్రతిమ, ఋషుల ప్రతిమలు, చెట్ల కెగ్రాకుతున్న వానరాలు, ఏనుగులు, హంసలు, ఇతర పక్షులు ముఖ్యంగా ఎన్నదగినవి.

వాస్తుశిల్పం దృష్ట్యా అలంపురంలోని ఆలయాలను పట్టడకల్లులోని పాపనాథ ఆలయాలతోను, ఎల్లోరాలోని 14 వ గుహతోను పోల్చవచ్చును. ఈ దేవాలయాలు పరిమాణంలో మరీ పెద్దవేమీ కావు. అన్నిటిలోకీ పెద్ద ఆలయం 75 అ. X 50 అ. కంటె ఎక్కువలేదు. అయినా భారతీయ శిల్ప చరిత్రలో వీటికొక ప్రత్యేకస్థానం ఉన్నది. వీటి బహిరాకృతి ఒరిస్సా దేవాలయాలను, అంతర్భాగంలోని శిల్పము పశ్చిమభారతంలోని ఏక శిలాదేవాలయాలను పోలివున్నవి.

సంస్కృత వాస్తుశిల్ప గ్రంథాలలోని సూత్రాలనుబట్టి వీటిని ఏరకమైన దేవాలయాలుగా పరిగణింపవచ్చునో స్పష్టంగా చెప్పలేము. వాటి శిల్పశైలినిబట్టి, పనివాడితనాన్నిబట్టి, వాటి భౌగోళిక స్థానాన్నిబట్టి వేసరశిల్ప పద్ధతిలో నిర్మించినవని ఊహించవచ్చును.

అలంపురంలోని సూర్యనారాయణ దేవాలయం, వంకశేకరుడి, నరసింహాలయం, ముస్లిందర్గా, మసీదు మొదలైన ఇతర నిర్మాణాలు ఈ స్థలానికి రాజకీయంగా, సాంస్కృతికంగా ఉన్న ఉజ్వల దీర్ఘ చరిత్రకు నిదర్శనాలు. అనేకంగా ఉన్న వీర శిలలు, కన్నడం, తెలుగు, సంస్కృతాలలో ఉన్న శాసనాలు చారిత్రకులకు చాలా అమూల్యమయిన పరిశోధన సాధనాలుగా ఉపయోగించగలవు.

అలంపురానికి భారతీయ శిల్పచరిత్రలోగల ప్రభావం దృష్ట్యా అక్కడి శిల్పసంపదను పరిశీలించటం అవసరం.

దక్షిణాపథంలో శిల్పము, చిత్రలేఖనము రాయచూర్ జిల్లాలోని టెంకల్, పిక్లిహాల్‌లో ఉన్న కొత్త రాతియుగపు శిలా చిత్రలేఖనంతోను, మస్కి, కొండాపురంలోని ఆంధ్రశాతవాహనయుగం నాటి శిల్పంలోను ప్రారంభమైనాయి. అమరావతి, అజంతా, ఎలోరాలలోని ప్రాచీన శిల్ప పరిణామమును ఇంకా క్షుణ్ణంగా పరిశోధించవలసి ఉన్నది. ఈ పరిశోధన పూర్తిగా జరుగనిదే, దక్షిణాపథంలోని మధ్యయుగాల నాటి శిల్ప ప్రాముఖ్య

(46-వ పేజీ చూడండి)



నాగరాజు.

# ★ యద్భావ్యం తద్భవతి ★

'చిత్తం చిత్తం. క్షమించండి. ఏదో ధ్యానంలో వుండిపోయాను. ఎంతమాట! తమ కంఠం ఒకసారి వింటే మరి మరిచిపోగలమా ప్రభూ! ఒక్కసారి విన్నానో లేదో తారకమంత్రం లా మా శిష్యుడు సీనయ్య రాం భజనలా తమ కంఠస్వరం నా కర్ణపుటాల్లో మారు మ్రోగుతూనే వుంది. ఇవాళేమిటి ప్రభువ్వారికి నా మీద యిలా అనుగ్రహం పుట్టుకొచ్చింది. సమాధిలో వున్న నన్ను అమాంతం లాక్కొచ్చారు. ఏమిటి సెలవు?'

'మీరువచ్చి పదేళ్ళయినా ఇప్పటికి మాకు తీరుబాటైంది మిమ్మల్ని పరామర్శించడానికి'.

'చిత్తం నేనెక్కడికి పోతాను. మీ లోకపు పాలికాపును. మీ చెప్పుకింది చెమ్మను. నిరంతరమైన తపస్సుచే కృశించి వున్న మా శరీరం భరించలేని శిక్షలు విధించకుండా కావలిస్తే ఏమండో మాకో పెట్టి ఒక్కసారే మమ్మల్ని కడతేర్చండి.'

'ఎన్నిసార్లు చస్తావయ్యా! అయినా ఏమ్మందు ఇమ్మన్నావు నీకు? నల్లమందు తెప్పించనా?'

'ఏమన్నారు ప్రభూ! నల్లమందా? ఎన్నాళ్ళకు విన్నాను నా ప్రియురాలి పేరు! రామనామస్మరణ చేసినట్టుంది. నిజంగానా ప్రభూ! రోజుకో పావుతులం మంజూరు చేయించండి. చాలు. ఎన్నాళ్ళయినా మీ పాదాలదగ్గిరే పడివుంటాను. లేదా మళ్లా మా భూలోకానికి తోలెయ్యండి. ఇంకా మా శిష్యుల్ని చాలా మందిని తరింపజెయ్యవలసి వుంది.'

'ఇప్పుడిప్పుడే ఒకడు తరించాడు—మీ సీనయ్య'

'ఏమిటీ! వాడొచ్చాడా ఇప్పుడు. అవును. వాడెలాగూ ఇక్కడకు తప్పక వస్తాడనుకుంటూనే వున్నాను'

'అయితే స్వామీజీ! ఇంత పచ్చిదా నందు లిదివర కెందుకలా వ్యవహరించారు? ఆ నిరంతర పంచమకార పరాయణత...'

'అదా ప్రభూ! అదంతా పూర్వాశ్రమం. ప్రస్తుతం ఆ సంగతి మీ రడక్కూడదు, నేను చెప్పకూడదు.'

'సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం వచ్చిందిప్పుడు మీకు. మర్యాదగా చెబుతారా? చెప్పించమన్నారా?'.

'అంత శ్రమెందుకు ప్రభూ మీకు. ఇదిగో మరెందుకు. యథార్థం చెప్తేస్తున్నాను. అవధరింపుడు. పెద్దలు జగత్తు మిథ్య, జీవితం అశాశ్వతం, ఆభోగాలూ అవినశ్వరాలన్నారు. అందుకని అశాశ్వతమైన జీవితం జీవించదలచుకొన్నప్పుడు ఆ అశాశ్వతమైన భోగాలనుభవించేస్తే అక్కడికి చెల్లు అయిపోతుంది. రేపు మనం ఉండడం ఖాయం కాదని యావజ్జీవితం ఉప్పుటెంకలా మాడాలన్నారు మహర్షులు. రేపు మనం ఉండడం ఖాయంకాదు కాబట్టే వీలైనంత త్వరలో వీలైనన్ని భోగాలనుభవించెయ్యాలని మా ఆశయం. భోగాలు క్షణభంగురాలన్నారు. మరి వాటి నొక్కొక్కటే క్షణ క్షణం అనుభవించేసి భంగురాలుగా చేసెయ్యాల్సిన బాధ్యత మాపైకూడా వుందని భావించాము మేము. ఇంతకూ జగత్తు మిథ్య అన్నారు గదా పెద్దలు. మరి మిథ్యా జగత్తులో వున్న భోగాలూ మిథ్యకాక ఏమవుతాయి? జగత్తు మిథ్య అన్నవారు మా అనుభవాన్ని మాత్రం సత్యంగా ఎందుకు పరిగణిస్తారో బోధపడదు...'

'వత్సా! సంతసించితిమి నీ తెలివితేటలకు. అయితే మరి ఆశ్రమం ఎందుకు మధ్యలో పిరాయించేశారు?'

'ఏం చెయ్యమన్నారు ప్రభూ! ఉన్న ఆస్తి అంతా హారతి కర్పూరంలా హరించిపోయింది. వ్యసనాలు మాత్రం మిగిలిపోయాయి. మళ్ళా మగ్గాన అయినదీ, మనకి కలిసివచ్చేది అయిన ఓ వాలకం ఎత్తాలి గదా. ఇంతకూ నేనూ చేసినదేముంది! చేతనైనంతమట్టుకు ఆత్మారాముడి సేవ చేసుకున్నాను. 'ఆనందో పరబ్రహ్మ! అహం బ్రహ్మాస్మి!' అద్వైతం తప్పంటారా? అంతా భగవల్లీల! వాడు ఆడించినట్లల్లా ఆడేను'

'మీ పూర్వాశ్రమంతోనే నాకు కొంత సానుభూతి వుంది. ఉత్తరాశ్రమంతో సపేమిరా లేదు. సరే మీకూ మోక్షమే కావాలా?'

'ఏం ప్రభూ మా సీనయ్య అడగలేదా? వెర్రిబాగులవాడు! నాకు మాత్రం మోక్షం వద్దుబాబూ! దానిసంగతి నాకు బాగా తెలుసు. ఇప్పుడిప్పుడే నామీద అంత అనుగ్రహం చూపించకండి.'

'అయితే మీకు పునర్జన్మ కావాలా? ఏం జన్మ కావాలో కోరి చూడండి.'

'మీ సెలవైతే ఆ మందేదో మంజూరు చేస్తే ఇక్కడే పడివుండడానికి నాకేమీ అభ్యంతరం లేదు. కాని నాకు జన్మన్నదే తప్పకపోతే అమెరికాలో ఒక పెద్ద సంపన్నుడిగా చేసి పడెయ్యండి'.

'మరి యిందాక శిష్యుల్నింకా తరింప చెయ్యలేనని వుందన్నారు'

'ఆ యేదో మాటవరస కన్నాను. వెను వెలు రోజుల్లో నల్లమందుమాత్ర యిచ్చేదాని కేడిచేవాళ్ళు! అయినా ఈసారి మరి మతం లోలికి పోదలుచుకోలేదు. పెద్ద పెట్టుబడి దారి రాజకీయవాదిగా అవతారం ఎత్తాలను కుంటున్నాను ... ప్రభూ ఒక చిన్నమాట అడుగుతాను మరేం కోప్పడకండి. ముఖమాట పడుతూ నే అడిగేస్తున్నాను క్షమించండి... నాకూ శ్రీమన్నారాయణమూర్తి వారిలా నా యిష్టం వచ్చిన అవతారం, ఒక్కటంటే ఒక్కటి ఎత్తే అధికారం యిప్పించ గలరూ—విష్ణుమూర్తులవారు శంఖుచక్రాలు పట్టుకోనక్కరలేకుండా అసలు వారు శేష పాన్పు దిగనక్కరలేకుండా, శివుని మూడు కన్నూ మూసుకుపోయేటట్టు, బ్రహ్మదేవుడు దిష్టి నిద్రపోయేటట్లు మరి మితిమీరిపోయిన మా భూలోకం సంగతి చిటికెలో చక్క బెట్టుకుని వస్తాను. ఒక్కసారి...'

నన్ను మీ ఏజెంటుగా పంపించి చూడండి ఏం చేస్తానో!

'ఊదరిపావు! అక్కడ యమలోకంలో బుర్రపెట్టే భూలోకంలోకి మాసే నీలాంటి ప్రబుద్ధులు చాలామంది వున్నారులే వాలి టిషియన్సులో, మినిస్టర్లలో, సైంటిస్టులలో. నువ్వూ వాళ్ళతో చేరతానంటావా వెళ్ళు. అలాగైతే ఈ జన్మతో సరి నీకు జన్మ రాహిత్యం అనుగ్రహిస్తాం. అయితే అది మోక్షమనుకొనకు నీకు జన్మ వుండదు, మోక్షం వుండదు. కాని సర్వదా ఇక్కడే యథాప్రకారం వుంటావు.'

'ఎందుకు ప్రభూ నాకీ పురాకులన్నీ ఏదో ఇందాక నేను కోరినట్లు అమెరికాలో ఒక పెద్ద సంపన్నుడిగా చేసి పడెయ్యండి. తరవాతి సంగతి చూసుకుందాం.'

'సరే పో అనుగ్రహించాం. అయితే జన్మంతా నీకు ప్రబలమైన జీర్ణకోశవ్యాధి వుంటుంది'—

ప్రభువ్వారి తీర్పు అయిపోయింది. స్వామీజీకి అప్పుడే కడుపునొప్పి ప్రారంభ మైంది. దండధరు లిద్దరు తీసుకుపోయారు.

* * *

'గ-భా-స మంగతాయారమ్మ'—ఆమె విసవిస వచ్చింది.

'బాబూ ఈ గ-భా-స బిరుదం మరి భరించలేను. ఒక తాతగారినికట్టి కాని పదవ యేళ్ళకి ముండమోసి వాటికి నైచింకి బిరుదు భారాన్ని మోస్తూవచ్చాను.'

'అయితే ఏం కావాలంటావు?'

'నాకన్నా కనీసం అయిదారేళ్ళు చిన్న వాణ్ణి భర్తగా అనుగ్రహించండి.'

కొంతమందికి సరిగ్గా కోరికలు కోవటం కూడా చేతనవటంలేదని ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు ప్రభువు.

'మరి ఆ చిన్నవాడు చిన్నవాడిగానే మీ కుండగానే చనిపోతే'

'ఏమో బాబూ నా కదంతా తెలీదు. పూర్వసువాసినీత్వయోగం మాత్రం మరి పట్టకుండా చూడు. ముసిలాడితో దీర్ఘ సువాసినీత్వం అంతకన్నా వద్దు. కావలిస్తే ఒక జన్మంతా కన్యగా పుణుషోపవాసం చేస్తాను.'

'గత జన్మలో మీ జీవితచరిత్రంతా పరిశీలిస్తే మీ కోర్కె సమంజసంగానే వున్నట్టు తోస్తుంది. నిత్య సువాసినిగా వినీతర వై పుట్టు.'

అయిపోయింది తీర్పు. అజానుగా తేటా తెలీని భటు లిద్దరామెను సగౌరవంగా తోడుకుని వెళ్ళిపోయారు.

* * *



ధాన్యలక్ష్మి ఆరాధన

—చిత్రం : పూర్ణానందశర్మ]

'శేవమ్మ కుటుంబరావు'—

'స్వరాని కెల్లినా సవతిపోరు తప్పకట్లు నా పేరు కింకా ఈ తోకపోలేదూ!' అను కుంటూ వచ్చిందామె. ఆమె వెంబడే కుటుంబరాయ కవిగారు కూడా వచ్చి చేరారు.

'నాకు మరి కవిభార్యగా తప్ప మరే జన్మయినా సరే అనుగ్రహించండి'

'ఏం'

'ఆయన నన్ను నానా కాల్చుకు తిన్నాడు'

'అయితే వచ్చే జన్మలో మీ భర్తన్నె కాల్చుకు తినండి. ఆయన భార్యగా ఫలాని ఊళ్ళో మహిళామండలి కార్యదర్శినిగా మీకు జన్మ అనుగ్రహిస్తున్నాం'

'మరి నేను ముందుపుడితే అతని కన్నా పెదదాన్ని అయిపోనూ?'

'పరవాలేదు. అయినా మీకంటే వచ్చే

# ★ యద్భావ్యం తద్భవతి ★

పోదు. అయినా మీరు కాలేజీ గరల్ కూడా కాబోతున్నారు కాబట్టి వయస్సు ప్రసక్తి రాదు.'

'అవునుగాని బాబూ అడగ మరిచాను. మళ్లా నేను ఈయన భార్యనే కావాలి?'

'ఈయనే మీ భర్త అయితే నేం? ఈయన్ని ప్రాక్టీసు లేని ప్లీడరుగా ఉత్పత్తి చేసి పడేస్తాం. అయినా మరికవిత్వం చెప్పడని మీకు హామీ యిస్తాం.'

'మరి ఆయనకు ప్రాక్టీసు లేకపోతే మహిళా మండలి కార్యదర్శినిత్వం నేనేం వెలగబెడతానండీ.'

'ఫరవాలేదు—శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు! మీ బుద్ధికుశలత వల్ల ఆ తకరారు లేకుండా చేసుకోగలరు.'

'అన్నట్టు మళ్లా. నేను ఆడజన్మే ఎందుకు ఎత్తాలి?'

'మరి ఆ సంగతి అడగరేం? పోనీ సిరాయించేస్తాం. మీరే భర్త, ఈయనే భార్య. ఏమిటండీ కుటుంబరావుగారు! అలా నిర్ఘాంతపోయి చూస్తారేం!'

'చూస్తున్నాను చూస్తున్నాను. వినక అయింది చాలక ఈ జన్మలో నాకిది అదృష్టముగా మొగుడై కూచుంటుందా! అనిచూస్తున్నాను. దీని సంగనాదికబురూ ఇదినూ! అయ్యా మా యిద్దరికీ ఎందుకీ తగులాటం? ఇప్పటితో యిక తెగతెంపులు చేసెయ్యరాదూ!'

'అదేమిటండీ. నిత్యమూ దెబ్బలాడుకుంటూనే డెబ్భైయేళ్లు విశేషంగా కాలక్షేపం చేసిన పుణ్యదంపతులు మీరు విడిపోవడం బాకిపంలేదు సుమండీ' అని మధ్యలో చిన్న పాడివేశా డమాత్య శేఖరుడు.

'మీదయ మీ కలాగుతోస్తే అలాగు చెయ్యండికాని నాకు కవిత్వం చెప్పే యోగ్యతమాత్రం తప్పిపోకుండా చూడండి' అన్నారు కుటుంబరావుగారు.

"మీకు కవిత్వంమీదవున్న మమకారానికి చాలా సంతోషిస్తున్నాం. తప్పక మీరొక గొప్పకవయిత్రి అవుతారు'

'మరి నామాట' అంది శేషమ్మ.

'ఫలానా కవయిత్రి కాంతమ్మగారి మొగుడు'

'అంతేనా మరి జన్మంతా నాకో వ్యక్తిత్వమంటూవుండదూ?'

'ఈ జన్మకు మీ కది సశేషం. అదే విశేషం. ఇకవెళ్ళండి'—

* * *

'శ్రీమతి శిరోమణీ!'

ఆమె వనూనే 'అయ్యా నా పేరు శిరోమణి. అసలు నేను పతివ్రతా శిరోమణిని. అగ్నిహోత్రంలా చాలా పవిత్రంగా బతికిన దాన్ని...'

"సరేగాని మీరు మా చిత్రగుప్తుడికి ప్రమోషను రాకుండా శపించగలరూ?'

'అదేమిటండీ నాతో పరాచకాలాడుతున్నారు!'

'మీరు విధిలేక జన్మంతా ఒక్కపతితో కాలక్షేపం చెయ్యడమే పాతివ్రత్యం అనుకుంటున్నారు. రక్షించి మీరు అన్నట్టు జరగలేదుకాని ఆయన్ని మీరుపెట్టని శాపనార్థం లేదు. అదిసరేకాని ప్రస్తుతం మీ కోరిక ఏమిటి?'

'నాకు మరి పునర్జన్మవద్దు. స్వర్గవాసం కటాక్షించండి.'

'తప్పు తప్పు. మీబోటివారలాంటి కోరికలు కోరకూడదు. అక్కడ మీరు మైలపడిపోతారు. మీ పవిత్రత మరీ బాగా సాగాలంటే వెళ్ళి కృష్ణారాయపురాగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లుగారి యింట రుబ్బుపొత్రంగా అంటే బాలవితంతువుగా ఒక జన్మగడపండి'—

ఆడారిభటుడొకడామెను తోడుకొని వెళ్ళిపోయాడు.

* * * *

'సుమిత్రా—ప్రేమశ్రీ ఉభయులూ'—

ఒక కాలేజీ స్టూడెంటు జంట—పాపం ఇద్దరూ ప్రణయప్రబంధ రచన ఉపక్రమించి కృత్యాద్యవస్థనధిగమించకుండానే 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా' ఆగిపోయి ఎడమొగమూ పెడమొగమూ ఐ ఒక రైలు ప్రమాదంలోమాత్రం ఏకీభవించి వచ్చారు. అందులో ప్రేమశ్రీ గ్రంథకర్త.

అది అతని 'కలం' పేరు!

ప్రేమశ్రీతో ప్రభువు—

'నువ్వీమెను ప్రేమించావుకదూ'

'ఏం అది ఒక నేరమే!'

'కాదోయ్ అడిగిన మాటకు సమాధానం చెప్పు'

'నేను ఈమె నేనన్న మాటేమిటి? చాలా మందిని ప్రేమించాను. ఈమెను నేనేనన్న మాటేమిటి? చాలామంది ప్రేమించారు. ఈమె నన్నేనన్న మాటేమిటి? చాలా మందిని ప్రేమించింది. ఈ విషయంలో మాత్రం ఆమె, నేనే కాదు మాలో చాలా మంది విశాల హృదయులు'

'అబ్బ అది కాదోయ్ నువ్వీమెను నమ్మించి దగా చేశావుట. దానికి నీకేం శిక్ష విధించమంటావు'

"నేనే నేనేమిటి చాలామంది దగా చేశారీమెను. ఈమె చాలా మందిని దగాచేసింది. దానికేం చెబుతారు?"

'అది ప్రత్యేకంగా వాళ్ళకి విధ్యుక్తమైన శిక్షగురించి ఆలోచించేటప్పుడు చూసుకుంటాం. ముందు నీ నేరానికి నువ్వు శిక్ష అనుభవించక తప్పదు. అది సరేకాని నువ్వీమెనెందుకు దగా చెయ్యవలసి వచ్చిందో కారణం చెప్పగలవా?'

'అసలు మాలో మేము ఒకరి కొకరం దగా చేశామని అనుకోమండి. తాత్కాలికముగా అనుకున్నా అదే జీవితాంతం పట్టించుకోము. మరి మీ కెందుకూ పట్టింపు?'



'మీ ఉభయుల్లో ఎవరూ పట్టించుకోకపోతే మాకూ విపట్టింపులు వుండవు. ఈమె పట్టించుకుంది కనక నే నీ అంతవాడిని ఇలా నిలదీసి అడగవలసి వచ్చింది.'

'నే నెరిగినంతమటుకీ చాలా మంది ఎప్పటి కయ్యది ప్రస్తుత'మప్పటికి...నప్పుకు పోయే వారులే. అంచాత ఈమెకూడా అలాంటిదే అయివుంటుం దనుకుని నేనూ అందుకు తగినట్లే ప్రవర్తించాలని అలా చేశాను.'

'అహో! లా స్టూడెంటువా? లాజిక్కు స్టూడెంటువా నాయనా నువ్వు!'

'ఏదీకాదు. సాహిత్యం చదువుతూ మానేసి తత్వశాస్త్రం అభ్యసిస్తున్నాను.'

'అలాగా. కాని తప్పునాయనా! నీకు లోకజ్ఞతయెడల నిశితమైన చూపుందికాని ఇంకా తగినంత అనుభవశాలివి కావు. ఆరకం అనుభవం తనుమాత్రం వున్నా, గ్రంథకర్తవే అయినా ఇంకా ఆ అనుభవం ఒంటబట్టలేదు. నిజంగా లోకంలో చాలా మంది చెడ్డవాళ్ళు అని మనం అనుకొన్నా, గ్రహించినా అది మనఅభిప్రాయం మటుకే గాని లోకులతో వ్యవహారంచేటప్పుడు అందరియెడలా మనం ముందుగానే అలాంటి అభిప్రాయాన్ని కార్యరూపంలో వ్యక్తం చెయ్యకూడదు. అదీగాకపోసీ మాటవరసకి నువ్వన్నదీ నిజమేననుకుందాం కాని ఒకవేళ నీలాంటివాళ్ళ సంఖ్య ఎక్కువ కావడం వల్లనే వాళ్ళు కూడా అలా తయారవాలని వచ్చిందేమోనని ఎప్పుడన్నా ఆలోచించావా? స్త్రీ హృదయం చాలా గంభీరం నాయనా!'

'ఏమిటి మా చెంగల్రావుపేట నూతుల కన్నానా?'

'అదిగో మళ్ళా నీధోరణే నీది. ఊరుకుంటున్నానుగదా అని చాలా స్వతంత్రంగా మాట్లాడుతున్నావు. అదంతా ధీరత్వమే అనుకుంటున్నావు. కాదు సగం మాత్రమే. సగం పెడసరం. నీ ధీరత్వాన్ని అభినందిస్తాను. పెడసరం గర్హిస్తాను. స్త్రీ హృదయాన్ని అర్థంచేసుకోవాలంటే చాలా కృషీ సహనం అవసరం. ఏకకాలంలో మన మెదడూ, హృదయమూ రెండూ కలసి పని చెయ్యాలి. మన హృదయమొక్కటే పని చేస్తే అందులో మాధుర్యాన్ని చవి చూడవచ్చు కాని సత్యం అంతుపట్టదు. మనం మెదడొక్కటే వినియోగిస్తే ఆ సత్యమేదో అంతుపటవచ్చు కాని మాధుర్యం అందదు. ఒక్క స్త్రీహృదయరహస్యం [illegible] ఎరిగినవాడు ఆ పురుషుని జన్మ చరితార్థమైనట్టే. నీకీ జన్మలో అలాంటి అవకాశం ఒకటి ప్రసాదిస్తాను. గత జన్మలో సంసారంలో భాగస్వాములు కాలేకపోయిన మీ యుభయులూ ఈ జన్మలో వ్యాపారంలో భాగస్వాములైతే అప్పుడు కొంత నీకు స్త్రీ హృదయం అంతుపడుతుంది. ఇద్దరూపోయి రాజధానిలో తప్ప రాష్ట్రమంతటా మద్య నిషేధ చట్టం అమలు జరిపే ఆంధ్ర ప్రజా ప్రభుత్వ రాజధాని హైదరాబాదులో జాయింటుగా ఒక బ్రాందీ షాపు పెట్టుకోండి'—

ఇద్దరూ కిక్కురు మనకుండా వెళ్ళిపోయారు

* * *

'సుబ్బారాయుడు గారూ, ఉరుపుగండభేరుండం గారూ?'—

ఆయన పాపం అతి దీనవదనంతో ఆకాశం కేసి చూస్తూ ప్రవేశించారు. దీనంగావున్నా కేక పెట్టిన భటుణ్ణి 'అదేమిటోయ్ అలా పిలుస్తావు కవిగండభేరుండ అన్నది నా బిరుదైతేను' అని గదమాయించారు.

'ఆఁ చూడండి సుబ్బారాయుడు గారూ, పరాకు చిత్తగిస్తున్నట్లున్నారు! పాపం చెప్పుకోదగిన పాపా లేవి మీరు చేసివుండలేదు. మీకు పాపాలు చెయ్యడం అసలు చేతకాదు. సాహిత్య అకాడమీ మెంబరులైయుండి పక్షి పూర్తయినా చేయించుకోలేని మీకేం పాపం చెయ్యడం చేతనవుతుంది! మీకు పునర్జన్మ లేదు, స్వర్గనరకాలు లేవు. ఊరికే గగనంలో అలా విహరిస్తూ వుండండి'

'పోనీ స్వర్గాన్నొకసారి చూపించేసి వదిలెయ్యండి, అక్కడే ఓ అడవిలోనో గుహలోనో.'

'మీకు స్వర్గం పొలిమేరల్లోకి వెళ్ళడానికి వీల్లేదు. అయినా మీ కెందుకండీ స్వర్గం. మీ కవులు సృష్టించుకొన్నదే స్వర్గం. మీ రెక్కడ సంకల్పిస్తే అక్కడే ఓ స్వర్గం అవతరిస్తుంది'

'ఏమిటో మీ మాటలు నా కర్థంకావడం లేదు. నా కవిత్వంలాగే అయోమయంగా వున్నాయి'

'పోనీ స్వర్గంలో మిమ్మల్ని జైల్లో పడేయించమన్నారా?'

'వద్దు మహాప్రభో వద్దు స్వర్గ కారావాసంకంటే నరకంలో స్వేచ్ఛావిహారం నయం.

'అయితే పొండి గగనంలో గండభేరుండ పక్షిగా'—అంతే ఠక్కున సుబ్బారాయుడు గారు అయిపోయారు పాపం పక్షి!

'ప్రొఫెసర్ కోరి కే,—

ఆయన కళేబరాన్నీడ్చుకుంటూ వచ్చాడు. ఆయన నిలుచోటాని కాయాసపడుతూ వుంటే ప్రభువుల కనుసన్న ఒక భటుడు కుర్చీలో వేశాడు.

'హలో ప్రొఫెసర్! మీకేదో అన్యాయం జరిగిందట!'

(47 వ పేజీ చూడుడు)






ఆ నీరిలోనఁ దోఁచు తారక ప్రతిబింబ, మొక్కొ యనఁగ వెలుఁగు చున్నయపుడు
రాచకొడుకులెల్లఁ జూచుచు నుండిరి, దానిఁ బుచ్చుకొను విధంబు లేక.

వ. అట్టియవసరంబున.

## ద్రోణుఁడు హస్తిపురంబునకు వచ్చుట

క. నానావిధశరశరధుల, తో నున్నతచాపధరుఁడు ద్రోణుఁడు వారిం
గానఁ జనుదెంచి యంతయుఁ, దా నప్పు డెఱింగి రాజతనయుల కనియెన్.

చ. భరతకులప్రసూతులరు భాసురశస్త్రమహాస్త్ర విద్యలం
గరము ప్రసిద్ధులై పరఁగు గౌతమశిష్యుల రిట్టిమీకు దు
ష్కరముగ నూతిలోఁ బడిన కాంచనవీటఁ గొనంగ నేర కొం
డొరులమొగంబు సూచి నగు చుండఁగఁ జన్నె యుపాయహీనతన్.

వ. దీని బాణపరంపరం జేసి పుచ్చి యిచ్చెదఁ జూడుం డీవిద్య యొరు లెవ్వరు నేర రని ద్రోణుం డొక్కబాణం బభిమంత్రించి దృష్టిముష్టిసౌష్ఠవంబు లొప్ప నక్కందుకంబు నాటనేసి దానిపుంఖంబు మఱియొకబాణంబున నేసి తత్పుంఖం బొం డొకబాణంబున నేసి వరుసన బాణరజ్జువు గావించి దానిం దిగిచికొని యిచ్చినం జూచి రాజకుమారు లెల్ల విస్మయం బంది ద్రోణుం దోడ్కొని చని భీష్మున కంతయు నెఱింగించిన నాతండును.

క. ఆసన్నపలితు ననఘు శ, రాసనగురు భూరిసత్త్వు నసితకృశాంగున్
భూసురవరు ద్రోణు గుణో, ద్భాసితు వినినట్లు చూచి పరమప్రీతిన్.

క. ఎందుండి వచ్చి తిందుల, కెం దుండఁగ నీకు నిష్ట మెఱిఁగింపుము న
ద్వందిత యని యడిగిన సా, నందుఁడు ద్రోణుండు భీష్మునకు నిట్లనియెన్.

వ. ఏ నగ్నివేశుం డను మహామునివరునొద్ద బ్రహ్మచర్యాశ్రమంబున వేదాధ్యయనంబు సేసి ధనుర్వేదం బభ్యసించుచున్నవాఁడ పాంచాలపతియైన పృషతుపుత్త్రుండు ద్రుపదుం డనువాఁడు నాకిష్టసఖుండయి యెల్లవిద్యలు గఱచి యేను పాంచాలవిషయంబునకు రాజ నయిననాఁడు నాయొద్దకు వచ్చునది నారాజ్యభోగంబులు నీవు ననుభవింప నర్హుండ వని నన్నుఁ బ్రార్థించి చని పృషతుపరోక్షంబునఁ దద్దేశంబునకు రాజయి యున్న నేను గురునియుక్తుండ నై గౌతమిం బాణిగ్రహణంబు సేసి యిక్కుమారు నశ్వత్థామ నధికతేజస్వి నాత్మజుం బడసి ధనంబులేమిం గుటుంబభరణంబునం దసమర్థుండ నయి యుండియు.

క. పురుషవిశేషవివేకా, పరిచయు లగు ధరణిపతుల పాలికిఁ బోవం
బరులందు దుష్ప్రతిగ్రహ, భర మెదలో రోసి ధర్మపథమున నున్నన్.

క. ధనపతులబాలురు ముదం, బున నిత్యముఁ బాలు ద్రావఁ బోయిన నస్మ
త్తనయుండు వీఁడు బాల్యం, బున నేడ్చెను బాలునాకుఁ బోయుం డనుచున్.

వ. దానిం జూచి దారిద్ర్యంబునకంటెఁ గష్టం బొండెద్దియు లేదు దీని నాబాలసఖుండగు పాంచాలుపాలికిం బోయి పాపికొందు నాతండు దనదేశంబున కభిషిక్తుండు గాఁ బోవుచుండి నన్ను రాఁ బనిచి పోయె.

మత్తకోకిలము. వేఁడు కొంటయుఁ గష్ట మైనను వేఁడు లేనిసుహృజ్జనున్
వేఁడికో లుచితంబు కావున వేడ్కతోఁ జని సోమకున్
వేఁడినన్ ధన మీఁడె దేనియు వీనిమాత్రకు నాలుగేన్
బాఁడికుఱ్ఱుల నీఁడె వీనికిఁ బాలు ద్రావుచు నుండఁగాన్.

వ. అని విశ్వసించి ద్రుపదునొద్దకుం బోయి నన్నెఱింగించిన నాతండు ధనరాజ్యమదంబున నన్నును దన్నును నెఱుంగక యేను రాజను నీవు పేదపాఱుండవు నాకును నీకును నెక్కడిసఖ్యం బని పలికిన వానిచేత నవమానితుండనయివచ్చితి నని ద్రోణుండు దనవృత్తాంత మంతయుఁ జెప్పిన.

క. విని రోయుటఁగ గాఢ్లం, బెనఁగెం బా ననుచుఁ బొంగి భీష్ముఁడు ద్రోణున్
ఘనభుజ నభీష్టపూజా, ధనధాన్యవిధానముల ముదంబునఁ దనిపెన్.

వ. మఱియును.

చ. మనుమల నెల్లఁ జూపి మతి మంతుఁడు శాంతనవుండు వీరిఁ జే
కొని గురువృత్తిమైఁ గఱపు ఘోరశరాసనవిద్య లెల్లఁ జెం
పున జమదగ్నిసూనుఁడును బోలఁడు నిన్నని వింతు విల్లునే
ర్పున నయనైపుణంబునను భూరిపరాక్రమగర్వసంపదన్.

వ. అని కుమారుల నెల్లం జూపి ద్రోణునకు శిష్యులంగా సమర్పించిన ద్రోణుండును వారలం జేకొని యందఱ కిట్లనియె.

తే. అస్త్రవిద్యలు గఱచి నా కైనయిష్ట, మొగిని దీర్పంగ నిందెవ్వఁ డోపు ననినఁ
బాయమొగమిడి కౌరవుల్ పలుక కుండి, రేను దీర్చెద నని పూనె నింద్రసుతుఁడు.

వ. ఇట్లు దనయిష్టంబు దీర్పం బూనిన యర్జును నాచార్యుం డతిస్నేహంబునఁ గౌఁగిలించుకొని కరంబు సంతసిల్లి కుమారు లెల్ల విలువిద్యఁ గఱపుచున్న నానాదేశంబులం గల రాజపుత్త్రు లెల్ల వచ్చి వారితోడఁ గలసి కఱచుచుండిరి మఱియు సూతపుత్త్రుం డయిన రాధేయుండును ధనుర్విద్యాకౌశలంబున నర్జునునితోడ మచ్చరించుచు దుర్యోధన పక్షపాతియై యుండె నంత.

క. నరుఁ డస్త్రశస్త్రవిద్యా, పరిణతి నధికుఁ డయి వినయ పరుఁ డయి శశ్వ
ద్గురుపూజాయత్నంబునఁ, బరఁగుచు సంప్రీతుఁ జేసె భారద్వాజున్.

వ. అయ్యర్జునుతోడి విద్యామత్సరంబునఁ జీఁకటి నాతం డేయ నేరకుండవలయు నని తలంచి యశ్వత్థామ రహస్యంబున నన్నసాధకుం బిలిచి యెన్నండును నరునకు నంధకారంబునఁ గుడువం బెట్టకుమీ యని పంచిన వాఁడును దద్వచనాను రూపంబు సేయుచున్న నొక్కనాఁటిరాత్రియందు.

ఉ. వాసవనందనుండు గుడువం గుడువం బటుమారుతాహతిం
జేసి చలించి దీపశిఖ చెచ్చెరఁ బోవుడు భోజనక్రియా
భ్యాసవశంబునం గుడిచి పన్నుగ నిట్టుల విద్య లెల్ల న
భ్యాసవశంబునం బడయ భారము లేదని నిశ్చితాత్ముఁ డై.

క. పాయక చీఁకటియందును, నేయం దా నభ్యసించె నిట్టిమొదం గాం
తేయుధనుర్జ్యాధ్వని విని, ధీయుక్తుఁడు ద్రోణుఁ డరుగు దెంచి ముదమునన్.

సీ. అతనియస్త్రవిద్యాభియోగమునకుఁ, బ్రియశిష్యవృత్తికిఁ బెద్ద మెచ్చి
యన్న ధనుర్ధరు లన్యులు నీకంటె, నధికులు గా కుండు నట్లు గాఁగఁ
గఱపుదు విలువిద్య ఘనముగా నని పల్కి, ద్వంద్వసంకీర్ణ యుద్ధముల తెఱఁగు
రథమహీవాజివారణములపై నుండి, దృఢచిత్రసౌష్ఠవ స్థితుల నేయ.

తే. బహువిధవ్యూహభేదనోపాయములను, సప్రయోగరహస్యాతిశయముగాఁగఁ
గఱపె నర్జునుఁ డొంటిభా ర్గవుఁడు వింట, నిట్టిఁడే యని పొగడంగ నెల్ల జనులు.

## ఏకలవ్యుం డనువాఁడు ద్రోణు నారాధించి విలువిద్య గఱచుట

వ. మఱియుగదాకార్ముకప్రాసాసితోమరకుంతశక్త్యాదివివిధాయుధంబులయందును గుమారుల నందఱ జితశ్రములం జేయుచున్న ద్రోణాచార్యుల మహాప్రసిద్ధి విని హిరణ్యధన్వుం డను నెఱుకురాజు కొడు కేకలవ్యుం డనువాఁడు ధనుర్విద్యాగ్రహణార్థియయి వచ్చిన వాని నిషాదపుత్త్రుం డని శిష్యుంగాఁ జేకొనకున్న వాఁడును ద్రోణు ననుజ్ఞ వడసి చని వనంబులోన.

తే. వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి, దాని కతిభక్తితోడఁ బ్రదక్షిణంబుఁ
జేసి మ్రొక్కుచు నంతతాభ్యాసశక్తి, నస్త్రవిద్యారహస్యంబు లబ్ధిఁ బడసె. ☆

# ★ దున్నని పంట ★

కంటే ట్యూషను రాపావణాతే ఎక్కువ వాళ్లాయంటాం. నేంవిటి?"

"కాదుమరి! పరీక్షల్లో ప్రశ్నలు అడుగుతారు. అవి తెలుసే జవాబులు రాయొచ్చు. ఇంకా మాట్లాడితే అవి చెప్పినవాడిచేతే రాయింపించుకోవచ్చు!"

"ఓస్సె!" అన్నాను, ఆశ్చర్యపోయి.

"ఓసి లేదు గోచీ లేదు. ఆ చిన్నయ్యకి చూపార్ని చూడూ. ఇంటరువాళ్లకి చెబుతున్నాడు మళ్లీని. ముఖ్యంఅయిన కొశ్చన్లు చెప్పి, అన్సర్లు చెబుతాను రాసుకొమ్మన్నాడు. ఒక్కడు రాసైనా?"

"మరి?"

"వాళ్ళు రాసుకుంటే స్పెల్లింగు తప్పులు వొస్తాయిట. 'మీకు రాసిఇచ్చేస్తాండి చూస్తారూ, ప్రైవుచేయించేసుకుంటాం' అన్నారు వాళ్ళు. అలాఅయితే కొన్ని తొగిరం పూర్తవుతుందనికూడానూ, పైగా. కాలేజీ క్లాసుల్లోనే అలాఉంటే మరి అనగా ఎంత, నలిగగాయ క్లాసులు!" అన్నాడు బాబీ.

పెద్దపరీక్షలకి చాలాస్ట్రిక్టుగా ఉండాలనుకున్నాడు జానకిరామయ్యగారు. అన్సరు పుస్తకాలకి కవరుమీద "సూచనలు" సైక్లో స్టైలు చేయించేశు. ముఖ్యమయిన సూచన పుట్రాళ్ళు నంబర్లే కాని పేరు రాయడానికి వీలేదనీ, పేరురాసిఉన్న పుస్తకాలు రద్దు చేసేస్తారనీన్నీ. ఈ సూచనలు యింకా సైక్లో స్టైలు అవుతూఉంటేనే ఉప్పందిపోయింది పేపర్లకి. హెడ్మాస్టరుగారు గడసరి అయితే కావచ్చునుకాని వాళ్ళుమాత్రం ఏం తీసిపోయారూ? పెద్దఫారాల మాష్టరూ చిన్నఫారాల మాష్టర్లూ పిచ్చాపాటీ మాట్లాడుకోవడంలో దీని నిగ్గు యింకా తేలిపోయింది, యీ నెంబర్లు యిలాఉండవనీ, రూపభేదం పొందికే నంబరింగు అవుతాయి అనీ, తిరిగి మార్కులుపడ్డతర్వాత స్వస్వరూపం స్వీకరిస్తాయి అనీన్నీ.

పరీక్షలు దగ్గిర పడుతూన్న కొద్దీ సుఖంగా మెసులుతున్నాడు హెడ్మాస్టరుగారు. ఆయన కదలికలో ఏదో చురుకుదనం, కళలో తీక్షత పెరిగింది మాత్రం నిజం!

పరీక్షలయ్యాయి. ఏరోజు పేపర్లకట్టలు ఆరోజు హెడ్మాస్టరింటికి చేరుకున్నాయి. ఇంక ఆయన వాటిని ఓసారి చూసి నంబర్లుమార్చి వేసి, మేష్టర్లకి పంపాలి దిద్దడానికి. భోజనం అదీ చేసి, తాంబూలం అదీ వేసుకుని, రాత్రి తొమ్మిది దాటింతరవాత పూనుకున్నాడు జానకి రామయ్యగారు, యీ పనికి.

"పదే యిప్పుడారోజేవిటి కుదిరింది ముహూర్తం మీటికి? అర్ధరాత్రి అంకమ్మ శివాలని" పూర్ణమ్మగారు పక్కమీద దుప్పటి దులిపి వేస్తూ ఓ చిన్నకేక పారేసింది.

"ఎంతసేపు అరఘంటలో తెమిల్చి పారేస్తానూ. నువ్వలా కూర్చుని యీ నెంబరు వేస్తూ ఉండూ, నేను చెబుతూ ఉంటాను" అన్నాడాయన.

ఆవిడ పెన్నుపట్టు కూర్చుంది. ఈయన నెంబరు చెబుతున్నాడు. ఓ పది నెంబర్ల రాసేసరికో, పూర్ణమ్మగారు కుర్చీకి చేరబడిపోయి, కలం జారవిడిచేసి కళ్లు బద్దల గొట్టినటు నవ్వుతోంది.

(64-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[21-1-59 మొదలు 27-1-59 వరకు]

గ్రహస్థితి.

| | | | |
|---|---|---|---|
| శ | కు | | |
| | తే 24 దీ కుజుడు వృషభములో ప్రవేశించును. తే 25 దీ శుక్రుడు కుంభమందు ప్రవేశించును. తే 26 దీ బుధుడు మకరమందు ప్రవేశించును. వృషభ. మిధున. కర్కాటక సింహంలలో చంద్రుడు | | |
| ర కు | | | |
| బు శ | శు | | రా |

## *అశ్వని [చూ, చే, చో, లా]*

ఈ వారము కార్యభారము ఎక్కువ. రాజవార్తా ప్రసంగములు, వింత మాటలు వినుట, పరాక్రమములవల్ల ఘనత, ధనలాభం ప్రయాణము వుంటవి. అకాలభోజనమువల్ల వేడిచేసి బలహీనత, కడుపునొప్పి. కళ్ళు మంటవంటి సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందుట మేలు. ఉద్యోగస్తులకు అరణ్యప్రాంతములకు బదిలీ అవుటగాని, శెలవు పెట్టుటగాని జరుగును. విద్యార్థులకు మంచికాలము కాదు. పితృవర్గమునుండి సహాయము కలుగును. 23, 24 అధిక ఖర్చులు 26, 27 అనారోగ్యం.

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము ప్రతిపనికి అనవసరముగా ఆలస్యము జరుగుతుంది. ఏపని చేసేందుకూ సమాధానము కుదరక చికాకుపడతారు. ఆశాభంగం ఎక్కువ. వర్తకులకు లాభం తక్కువ. రహస్యములు కనిపెట్టుటలో నేర్పరితనమువలన జయము పొందుతారు. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు బదిలీ కావచ్చు. వారాంతమున అంతవరకూ తటస్థముగావున్న మిత్రుని సహాయముచేత కార్యానుకూలత పొందుతారు. ప్రయాణములో కలిసిన విదేశీయులతో స్నేహమేర్పడి విచిత్రవస్తుసంపాదన చేస్తారు. ఆత్మీయుల ఆరోగ్యచింతచే ఆందోళన పొందుతారు.

## * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ] *

ఈ వారము ఎవరి సహాయంపొంది కార్యములు చేదామనుకున్నారో అతనివల్లనే ఆటంకములు కలుగుతవి. ధనాభావం ఎక్కువగా వుంటుంది. ఆధ్యాత్మిక చింతకలవారగుటవలన ఈశ్వరకృపచే అన్నికష్టములు తీరి కార్యానుకూలత కలుగుతుంది. ఇంట్లో వారి ఆరోగ్యము ఆందోళన కలుగచేస్తుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు మొదట్లో నిరాశగావున్నా, వారాంతానికి, కొన్నాళ్ళనుండి నిలిచిపోయిన పాతబాకీలు వసూలవుతవి. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. కార్యానుకూలత, నష్టద్రవ్య లాభము. పుణ్యక్షేత్ర సంచారము. దేవతా దర్శనము కలుగును.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము బంధువుల రాకపోకలవల్ల ఖర్చులు ఎక్కువ. రావలసినడబ్బు చేతికందక అశాంతి. కోరు వ్యవహారములు కొంతవరకు అనుకూలిస్తవి. పరులకు సహాయము చేయబోయి మాటదక్కక నిందలు

---

## బి. నరసింగరావు

---

పొందుతారు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారముపట్ల పేచీలు. భార్యకు అనారోగ్యము. 26, 27 అధిక ఖర్చులు.

## * మృగశిర [వే, వో, కా, కి] *

ఈ వారము అనుకున్నట్టుగా పనులు జరగవు. ధనాభావముచే ఇబ్బంది కలుగుతుంది. బంధువులకు సహాయము చేయబోయి సాగక మాటపడి మనోవ్యధ పొందుతారు. ఎత్తయిన ప్రదేశములనుండి పడుటవల్లగాని, వాడయిన పనిముట్లవల్లగాని, గాయములు కలుగవచ్చు. యంత్రములు నడుపు నిపుణులకు, గనుల యజమానులకు కష్టముతోకూడిన లాభయోగము 26, 27 ప్రమాదసూచన. రసాయనిక శాస్త్రజ్ఞులకు మేలుకాలము.

## * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

గత రెండువారములనుండి కలుగుచుండిన ప్రతిబంధకములు గడిచి అధికారుల సహాయముచేతనూ, మీ నేర్పరితనము చేతను కార్యసిద్ధిని పొందుతారు. ఆర్థికస్థితి బాగుపడుతుంది. వారమంతా యోగప్రదముగా వుంటుంది. ప్రయాణము, అధికారుల ఆదరణ, ధనలాభము, కలుగుతవి. విద్యార్థులకు మేలుగా వుంటుంది. డాక్టర్లకు గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, చిత్రకారులకు, నటీనటులకు, యోగకాలము. 23, 24 అధిక ఖర్చులు.

## * పునర్వసు [కే. కో. హా-హి] *

ఈ వారము అన్ని యిబ్బందులు తీరుతవి. అనుకున్న సొమ్ము చేతికవస్తుంది. కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అవుతాయి. పిల్లల మేలుకొరకు కొన్ని ఏర్పాట్లు చేసారు. నూతన కార్యారంభము చేస్తారు. ప్రభుత్వ సన్మానము కలుగుతుంది. పండితులతో శాస్త్రగోష్ఠి జరిపి, జ్ఞానము వృద్ధిచేసుకుంటారు. విద్యార్థులు శ్రద్ధతో క్రొత్త విషయాలు నేర్చుకుంటారు. వారమంతా యోగదాయకముగా వున్నా ఆందోళన కలుగుతుంది. ఇంటివారి ఆరోగ్యము బాగుపడుతుంది. పండితులకు, ఉపాధ్యాయులకు, న్యాయవాదులకు న్యాయస్థాన ఉద్యోగులకు మేలుకాలము.

## * పుష్యమి [హూ. హే. హో. డా.] *

ఈ వారము మీకు యోగదాయకమైననూ, మానసిక ఆందోళన కలుగుతుంది. ధనయోగము వుంది. బంధుమిత్రులతో కలసి కవితాగోష్ఠి, గానసభలవంటి వినోదాలతో పాల్గొంటారు. దూరమందున్న ఆప్తుల క్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి, వ్యాపారస్తులకు వారమంతా లాభదాయకముగా వుంటుంది. విద్యార్థులకు చదువు సరిగా జరుగుతుంది. నీటిమీద ప్రయాణం చేస్తారు.

## * ఆశ్లేష [డీ. డూ. డే. డో] *

గతవారము పూర్తికాకుండా నిలిచిపోయిన పనులు యీ వారము లాభకరముగా చేయగలుగుతారు. ధనయోగము అనుకున్న దానికన్న ఎక్కువగా కలుగుతుంది. పుణ్యకార్యాచరణలో పాల్గొంటారు. పరులకు ఉపకారము చేసి కీర్తి పొందుతారు. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికారము పెరుగుతుంది. స్త్రీలతోనూ, బంధువులతోనూ, వినోదములతో ఆనందిస్తారు. కవులకు, గాయకులకు, నటీనటులకు కళాకారులకు మేలుకాలము.

## * మఖ [మా మీ మూ మే] *

ఈవారము యత్నకార్యములకు ఆటంకములు. కార్యభారము ఎక్కువ. తీరుబడి కాని కార్యక్రమమువల్ల అకాల భోజనము చేయుటచే ఉష్ణాధిక్యము, కళ్లమంట, కాళ్లు పీకు కడుపునొప్పివంటి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందుట మేలు. వర్తకులకు శ్రమ ఎక్కువ. ఉద్యోగస్తులు అధికారుల ఒత్తిడిచే శెలవు పెట్టవలసివస్తుంది. రాజకీయవాదులకు మేలుగా వుంటుంది. పితృవర్గమునుండి సహాయముచే ధనలోపము కొంత తీరుతుంది.



# నక్షత్ర ఫలితాలు



### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### (మో, టా, టీ, టూ)

ఈ వారము నిరాశగా వుంటుంది కాని, మిత్రసహాయమువల్ల క్రమేణా కార్యలాభము పొందుతారు. రహస్యములను కని పెట్టుటకు ప్రభుత్వముచే నియోగించబడతారు. ధనలోపమువల అందోళన. ఉద్యోగస్తులకు బదిలీ అయే యోగములున్నవి. వర్తకులకు మాంద్యము. విద్యార్థులకు శ్రద్ధ తక్కువ. ప్రయాణము, విదేశీయులతో పరిచయము, వింతవస్తువుల సంపాదన, కార్యసిద్ధి కలుగుతవి. ఇంట్లో వున్న వృద్ధుల ఆరోగ్యము చెడుటచే ఆందోళన.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము మీరు అనుకున్నట్లు పనులు జరుగవు. ధనాభావముచే ఇబ్బంది ఎక్కువ. విశ్వస్తసహాయమువల్ల పనులు చేయుదల్చుకున్నా శత్రువులు ఆటంకములు కలుగచేస్తారు. ఆధ్యాత్మికచింత కలవారగుటచే, ఈశ్వర కృపవల కష్టములను గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఇంటిలోవారి ఆరోగ్యము అందోళన కలిగించుతుంది. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు నిరాశ కలిగినా, నష్టద్రవ్య లాభము కలుగుతుంది. సాధుసజ్జన సాంగత్యముచే ఆత్మవికాసము కలుగుతుంది.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. రావలసిన డబ్బు చేతికందక అశాంతి. బంధువుల రాకపోకలవల ఖర్చులు ఎక్కువ. కోర్టు వ్యవహారములు కొంతవరకు అనుకూలిస్తవి. పరులకు చేయాలచే సహాయము చేసిందికి అపకారితోక మాటపడతారు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలవల్ల కార్యభారము ఎక్కువ. వర్తకులకు వ్యవహారము వట్ల పేచీలు. 26, 27 భార్యకు అనారోగ్యమువల్ల వ్యథ. విద్యార్థులకు బద్ధకముచే చదువు సాగదు.

### *చిత్త [పే, పో, రా, రీ]*

మీ ఆలోచనలు కార్యరూపమున వచ్చేందుకు కలిగే ఆటంకములకు నిరుత్సాహపడకుండా పట్టుదలతో ప్రయత్నించుటచే కార్యసిద్ధి పొందుతారు. సమయానికి డబ్బు చేతికి రాక అప్పు చేయవలసి వస్తుంది. కాని వారాంతమునకు తీరుస్తారు. 26, 27 లలో యంత్రములవల్లగాని, అగ్నివలగాని, ఎత్తయిన స్థలములనుండి పడుటవల్లగాని, కలిగే గాయాలు జాగ్రత్తవల్ల తప్పవచ్చు. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహపు సామానులు, రంగులు వ్యాపారస్తులకు గనుల యజమానులకు కష్టముతో కూడిన యోగము. ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, యంత్రములు నడుపు నిపుణులకు మేలుకాలము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకు ధనయోగము. వ్యవహారాలలో జయము శుభకార్యాలలో పాలొంటారు. బంధు దర్శనము. విద్యాప్రాప్తి, నూతన కార్యలాభము యీశాన్య దిక్కునుండి మంచి వార్తలో ఉత్తరములు వచ్చుట జ్ఞానమార్గ ప్రసంగములు యుక్తిగా ప్రసంగించుట. గణిత, జ్యోతిష శాస్త్ర చర్చలు, శుభభోజనంవంటి మంచి ఫలితాలు కలుగుతాయి. ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, ఇత్తడి, కంచు మొదలగు సరుకుల వ్యాపారస్తులకు లాభము. కవులకు చిత్రకారులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. విద్యార్థులకు చదువు సరిగా సాగును.

### * విశాఖ [తీ, తూ, తే, తో *]

ఈ వారము శుభకార్యములలో పాలొనుట, పుత్రప్రాప్తి సూచనలు ధనలాభము భాగ్యవృద్ధి బిరుదులుపొందుట ప్రభుసన్మానము ఘనకార్యాచరణ పుణ్యకార్యములు చేయుట, పుణ్యక్షేత్ర సంచారము. వేదవ్య జ్యోతిషశాస్త్ర ప్రసంగముల వంటి మంచి యోగములు కలుగును. విద్యార్థులకు మేలుగా వుంటుంది. ఉపాధ్యాయులకు, పండితులకు, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మంచికాలము.

### అనూరాధ [నా, నీ, నూ, నే]

ఈ వారము మీరు వినోదాలలో పాలొంటారు. బంధుమిత్రులతో కలసి వెండిపాత్రలలో, దధి, క్షీర, మధురపదార్థయుక్తభోజనము చేయుట. తలపెటిన కార్యములలో జయము. నీటిమీద ప్రయాణము. తెల్లనివస్తువులు కొనుటవంటి మంచి యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, వస్త్రములు, వెండి, బియ్యము, ద్రవపదార్థ క్రయవిక్రయములలో వర్తకులకు లాభము ఈ వారము మానసిక ఆందోళన ఉన్నా, అలంకార ప్రాప్తి. విందు, వినోదములు కలుగును. కవులకు, గాయకులకు, నటీనటులకు మేలుకాలము. విద్యార్థులకు చదువు సరిగా సాగును.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము ధనధాన్య వృద్ధి. కృషిమూలకముగా లాభము. పశువృద్ధి, వివాహాది శుభకార్యముల గురించి ఆలోచనలు జరుపుట, ఇవనసు లాభము. పరోపకారము వల్ల కీర్తి, ప్రభుత్వ కార్యనిర్వహణవల్ల గౌరవము, మొదలగు రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాలొన్నా చదువు బాగా సాగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు, యోగకాలము.

### * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. ఆరోగ్యము సరిగాలేని సూచనలు కనబడగానే గ్రహశాంతి చేయించుట మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన, విద్యార్థులకు సరిగా చదువు సాగదు. పితృవర్గమునుండి సహాయము. కార్యలాభము కలుగును. 26, 27 ఆరోగ్యభంగము. రాజకీయవాదులకు ఆందోళన. అధికఖర్చులు.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా]*

ఈ వారము అనుకున్న సౌమ్య సకాలములో నెరవేరదు. కార్యాచరణకు పాలుపోని అనిశ్చిత స్థితిలో వుంటారు. వేదాంతము

---

**—ధరలు:—**

నూలు వస్త్రములు: స్వల్పముగా పెరుగును

నూనె గింజలు: సమస్థాయిలో వుండును.

ఆహారధాన్యములు: నిలకడగా వుండును.

బెల్లము, పంచదార: మందముగా వుండును.

చింతపండు: తగ్గుదలలో వుండును

పప్పుదినుసులు: చురుకుగా వుండును

వెండి, బంగారము: స్వల్పముగా మరుగును.

అప్పుడప్పుడు మేఘాడంబరము కలిగి దక్షిణ ప్రాంతములో అచ్చటచ్చట వర్షించును.

* * *

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రము, హృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయున్నూ చూచుకొనునది.

కున్న పనులకు మొదట్లో ఆటంకములు కలిగినా శాంతిమునకు మిత్రసహాయమువల్ల లాభం. ఉద్యోగస్థులకు వనపర్వత ప్రాంతములకు బదిలీ అయే సూచనలున్నవి. ప్రయాణము, విదేశీయుల పరిచయము. విచిత్రవస్తు సంపాదన, మిత్రసహాయము కలుగుతవి. 26, 27 అప్తుల ఆరోగ్యము గురించి చింత.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము మీకు మిశ్రమయోగము. అనుకున్నటుగా పనులు జరగవు. కోరిన సహాయము సకాలమునకు లభించదు. అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. దైవముపై భారమునైచి, కార్యసాధనకు ప్రయత్నించి ఫలము పొందుతారు. వర్తకులకు చాలాకాలమునుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. వ్యర్థ ప్రసంగములవల్ల ఉద్యోగస్థులు అధికారుల ఆగ్రహమునకు లోనౌతారు. పుణ్యపురుషుల సాంగత్యము, ఆత్మవికాసము, శాంతి, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము వస్త్ర ద్రవ్యలాభము కలుగును. 26, 27 ఇంట్లో వారి అనారోగ్యముచే చింత.

***శ్రవణము [జూ, జే, జో, ఖా]***

మీ ఆలోచనల ప్రకారము కార్యక్రమాలు కొనసాగడానికి కొందరు అడ్డువస్తూవుంటారు. కొన్ని సందర్భములలో అశాంతి, బంధువిరోధము వచ్చును. కోర్టు దావాలు అనుకూలముగా తీర్పు అయినా, మరికొన్ని క్రొత్తచిక్కులు కలుగుతవి. కొర్రలు, రాగులువంటి అపరదినుసులు, మినుములు, ఉప్పు, నువ్వులు, నూనె సంబంధమగు వస్తువుల వర్తకులకు లాభము. అన్యజాతి వారివల్ల గౌరవము జరుగుతుంది. 23, 24 అధికఖర్చులు, 26, 27 భార్యకు అనారోగ్యం.

***ధనిష్ఠ [గా, గీ, గూ, గే]***

ఈ వారము ఎంత ప్రయత్నించినా అనేక ఆటంకములు కలుగుతవి. సాహసము బుద్ధుల గలవారగుటచే నిరాశ చెందక ప్రయత్నించి కలిగిన చిక్కులను విప్పుకొని మేలుపొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. జాగ్రత్తగా వుండకుంటవల్ల అవమానములకు దెబ్బలుతగిలే ప్రమాదము తప్పవచ్చు. గనుల యజమానులకు భూగర్భ శాస్త్రజ్ఞులకు లోహఖనిజ వ్యాపారస్థులకు, పోలీసుశాఖ వుద్యోగులకు శుభముతో కూడిన యోగము.

***శతభిషం [గో, సా, సీ, సూ]***

మీరు ధైర్యముతో వృత్తి ఉద్యోగములలో ముందడుగు వేసి హోదా, ఆదాయము పెంచుకుంటారు. క్రొత్త అనుకూలతలు ఏర్పడుతవి. మీ బుద్ధి కుశలత వల్ల ఉపద్రవాలు సాధిస్తారు. మీరు వేసుకున్న పథకము ప్రకారము అన్నివిధాల డబ్బు చేతికి అందుతుంది. మనుష సహాయము కూడ కలుగుతుంది. మాటపలుకుబడితో పరిస్థితులు అనుకూలమైన మార్పులకు తెచ్చుకొనగలుగుతారు. ఈశాన్యదిక్కు నుండి బంధువుల కుశలవార్తలు తెలుస్తాయి. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు నటీనటులకు, యోగకాలము.

***పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]***

ఈ వారం మీకు యోగప్రదము. గత వారము అనకుండా నిలిచిపోయిన కార్యములు ఈ వారము సుముఖమౌతాయి. అధికారముతోపాటు ధనాదాయంకూడ పెరుగుతుంది. బిరుదులు పొందుట సన్మానమువంటి రాజయోగములు కలవు. పండిత గోష్ఠి, నూతన గ్రంథములు చదువుటచే విజ్ఞానాభివృద్ధి కలుగును. పిల్లల యోగక్షేమ విషయములలో మీరుకొన్ని ఏర్పాట్లు చేస్తారు. వర్తకులకు లాభయోగము. విద్యార్థులకు మేలుకాలము. న్యాయవాదులకు న్యాయస్థాన ఉద్యోగస్థులకు, ఉపాధ్యాయులకు పండితులకు మంచికాలము.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]***

ఈ వారము లౌకిక వ్యాపారరంగములో చాలా జయప్రదముగా వుంటుంది. ఆదాయము ఎక్కువ అవుతుంది. నీటిమీద ప్రయాణము చేయవలసి వుంటుంది. కవితాగోష్ఠి, గానసభలు మున్నగు వినోదములలో బంధుమిత్రులతో కలసి పాల్గొంటారు. విద్యార్థులకు మేలుకాలము శుభకార్యములలో పాల్గొని మృష్టాన్నభోజనము చేస్తారు. బియ్యము, వెండి, బట్టలు, నూలు, వ్యాపారస్థులకు లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. వారమంతా శుభయోగములతో కూడినప్పటికీ మానసికాందోళన కలుగుతూ వుంటుంది.

*** రేవతి [దే, దో, చా, చీ]***

ఈవారము మీరు గౌరవ మర్యాదలు పొందకలుగుతారు. ఇతరుల శాంతి సౌభాగ్యాల కోసం ఎంతైనా శ్రమపడి కీర్తిని పొందుతారు. డబ్బురాబడి బాగుంటుంది. అప్తుల శుభకార్యాలలో స్త్రీలతోనూ, బంధుమిత్రులతోనూ పాల్గొని విందు వినోదములలో ఆనందిస్తారు. విద్యార్థులకు మంచికాలము. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ద్విగుణలాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 26, 27 కుటుంబ కలహము, అధిక ఖర్చులు.

★

# నేర్చుకున్న నీతి

మోసూరను గ్రామ మందు
కేశవుడను నొకడుగలడు.
కేశవుడే గాదు వట్టి
మోసగాడని ప్రతీతి.

వీనికి పై బట్ట లేదు
నాతి అనుట కేమి లేదు,
పొట్టు తోడ సంసారము
నెట్టుల్లో గడపుచుండు.

ప్రక్కవూర తన్ను మించి
టక్కరి యొకడున్నాడని,
పెక్కుమంది చెప్పగవిని
మక్కువపడె నతనిచూడ.

తానే బహుటక్కరి యన
తన్ను మించి యెవడో,
వానిపేరు బసవయ్యట
చూడవలయు వాని నంచు,

ఉలవల గుగ్గిళ్ళు కొన్ని
వలువయందు మూటగట్టి,
వంక పెట్టి భద్రముగా
చనుచుండెను పొరుగూరికి.

దారినడుమ నొక బాంధుడు
తారసపడె కేశవునికి;
విశదముగా మాటలాడ
బసవయ్యని తేటపడెను.

"మొదట గొప్ప పిదప కురుచ"
అతి దుర్జన సాంగత్యము,

రూఢిగాగ వీరిపట్ల
గాఢమైత్రి నెరపదలచి,

ఇద్దరి మైత్రికిగుర్తుగ
చద్దిమూట మార్చుకొనిరి,
వీడలేక వీడలేక
వీడినారు ఒకరినొకరు.

కొలది దూరమేగి యిట్లు
తలచె మదిని కేశవుండు,
"సులభముగా నా మోసపు
వలలో పడె బసివిగాడు.

ఉలవల గుగ్గిళ్ళను నే
పులుసన్నము అనగనమ్మి,
ఎరుగకుండ నామోసము
పెరుగన్నపు మూటనిచ్చె."

ఇంతటితో నా కథాక
కొంతమైన తెలియుననుచు,
సంతసపడి యొక్కచావి
చెంత చేరి మూటవిప్పె.

మూటవిప్పి చూడగా న
నోటమాట పడిపోయెను.
అందునున్న దేమిగాదు
అధ్వాన్నపు బంకమట్టి.

మోసగింపబోయి తాను
మోసపోయె కేశవుండు.
"చెరుపకురా! చెడెదవంచు"
ఎరుగవలయు దీనివల్ల.

 కె. శ్రీనివాసులు 

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# బాలల సంఘం



## బహుమతి పొందిన మిగతా రెండు రచనలు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలలసంఘం ఏర్పాటుచేసిన మొదటి పోటీలో పదిహేను వందలమంది సభ్యులు మాత్రమే పాల్గొన్నారు. మొత్తం ఏడువేలమంది సభ్యులలో కనీసం ఐదారువేలమంది అయినా పాల్గొంటారని ఆశించిన మాకు కొంత నిరుత్సాహమే కలిగింది. ఈసారి ఏర్పాటుచేసే పోటీలో సభ్యులైన బాలబాలికలందరూ ఎక్కువ ఉత్సాహంగా పాల్గొంటారని ఆశిస్తున్నాము.

పోటీలో ప్రథమస్థానంలో నెగ్గిన రెండు రచనలు గతవారం స్వర్ణోత్సవసంచికలో ప్రచురించాము. ప్రథమబహుమతులు గెలుచుకున్న వారి పేర్లు (1) అమరవాది అనంతపద్మనాభం (A వర్గం సభ్యుడు; నివాసం, ప్రొద్దుటూరు, సభ్యత్వపు సంఖ్య 789) (2) తమిడిపాటి సుబ్బలక్ష్మి (B వర్గము; నివాసం. అలికాపాలెం, పాత్రేరు, సభ్యత్వపు సంఖ్య 1892.)

స్థలాభావం చేత గతవారం ప్రచురించలేకపోయిన ద్వితీయ బహుమతి రచనలను ఇక్కడ ప్రచురిస్తున్నాము.

—భార్గవ]

### శ్రీకూర్మము

[బులుసు అధ్యాత్మరామం]

[A వర్గము, సభ్యత్వపు సంఖ్య 2335, సింగుపురం, శ్రీకాకుళంజిల్లా]

భారత దేశంలో విష్ణువు యొక్క అవతారమైన కూర్మనాథుని దేవాలయాలు చాలా తక్కువ. అందులో మన శ్రీకాకుళం జిల్లాలోని "శ్రీ కూర్మదేవాలయము" ఒకటి. ఈ సంవత్సరమే ఆ దేవాలయాన్ని దర్శించగలిగాము. ఇక్కడ ప్రతి ఏడాది ఫాల్గుణ పూర్ణిమకు పెద్ద యాత్ర జరుగుతుంది. ఈ యాత్రకు చాల దూరమునుండి ఎంతోమంది యాత్రికులు వస్తారు. యాత్రరోజులలో యాత్రికుల ప్రయాణమునకై ప్రత్యేకముగా బస్సులు నడుపుతారు. ఉత్సవమును స్వయముగా చూడవలసినదేగాని వర్ణింపతరము కాదు. ఈ దేవాలయానికి పౌరాణికముగా చాల ప్రశస్తి ఉంది.

ఇక్కడి శిల్పకళ చాలబాగుంటుంది. అంతే కాకుండా, చాలచిత్రముగా, కనుల పండువుగా ఉంటుంది. ఇక్కడి శిల్పం అంతా నల్లరాతిదే. మంటపము చుట్టూ స్తంభాలు ఒకదానితో ఒకటి సంబంధం లేకుండ దళ, శతదళాలను కలిగిన కమలాకారంలో ఉంటాయి. గోడలపై వివిధములైన నాట్య భంగిమములలో స్త్రీ పురుషుల శిల్పములున్నవి. ద్వారాలపైనున్న ఆకులు, లతలు, మొగ్గలు వీనిని చూడాల్సిందేగాని వర్ణింపవలనికాదు. ఒక్కొక్కసారి అది "నల్లరాయేనా?" అన్న భ్రాంతి కలుగుతుంది. శిల్పి ప్రతి అంగుళం మేరలో కూడా తన శిల్పచాతుర్యాన్ని అద్భుతంగా చూపించాడు. గర్భగుడి చాలచీకటిగా ఉంటుంది. అందుచేత ఎప్పుడూ ఒక దీపం వెలుగుతూ ఉంటుంది. కూర్మనాథుని విగ్రహం కూడ అతి సుందరమైనది. కృష్ణాష్టమి నాడు విగ్రహమును నీటితో అభిషేకిస్తారు. శ్రావణమాసంలో "ఆండాళమ్మ" ఉత్సవాలు చాలా బాగాచేస్తారు. వైశాఖంలో స్వామి కల్యాణం జరుగుతుంది. ఇక్కడి చెరువులో ఏనాడూ నీరు ఎండదు. ప్రతి సంవత్సరం కాశీ గంగవచ్చి ఇందులో కలుస్తుందంటారు. క్షీరాబ్ధి ద్వాదశినాడు తెప్పల ఉత్సవం జరుగుతుంది. ఇందులో కలిపిన అస్థికలు తెల్లగా స్ఫటికాలాంటి రాళ్లుగా మారుతాయి. ఈ దేవాలయం దేవతలచే నిర్మింపబడినదని ప్రతీతి.

ఇచ్చట గురువిగ్రహముకూడ కలదు. ఒకనాడు ఉపాహారం పెట్టబోగా, ఆరాత్రి అచ్చట నిద్రిస్తున్న ఒక బాలకుడికి తి



# బాలలసంఘం



కిందనీ, అందువల్ల ఆమె చేతులకు మేకులు కొట్టేరనీ ప్రతీతి. ఇక్కడి దేవుని [illegible] నిర్మించాడంటారు. ఈ దేవాలయం ఆదాయము సుమారు 15 వేలు కాని ఖర్చుకు ఆదాయానికి సరిపోదు. చుట్టూ శిల్పప్రాకారం, అందు రకరకాల పూల చెట్లూ ఉన్నాయి. గాలిగోపురం కూడా ఉంది. ఇప్పటికి బండిమీదగాని బస్సు మీదగాని పోవచ్చు. మేము బండిమీద వెళ్ళాము. తెల్లవారుజామునే బయలుదేరి వెళ్లి యాత్రముగించుకొని సాయంత్రానికి దాన్ని వదలేక, వదలేక వచ్చాము. మొత్తం మీద ఇక్కడ చూడవలసినవి చాలా ఉన్నాయి. ప్రతిరోజు యాత్రీకులు వచ్చి పోతూ ఉంటారు. దీన్ని చూస్తే జన్మతరిస్తుందంటారు.

## సంక్రాంతి

[అవటపల్లి సీతా[illegible]యప్రద]

[B వరం, సభ్యత్వపు సంఖ్య 5174, బాపట్ల, గుంటూరు జిల్లా]

నాకు ఎక్కువ ఇష్టమైన పండుగ సంక్రాంతి.

ఎందుచేత అనగా నెల పట్టిన దగ్గరనుంచి చలిలో లేచి ఇంటింటికివెళ్ళి ఆవుపేడ తీసుకొని వచ్చి గొబ్బెమ్మలుచేసి వాటికి గుమ్మడి పూలు పెట్టి ఇంట్లో పెద్దవాళ్లు వాకిట్లో వేసిన ముగ్గులమీద వరుసగా పెట్టుంటే చాలా సరదాగా ఉంటుంది. చూడటానికి ఎంతో అందముగా ఉంటుంది. సంక్రాంతి పండుగ రేపనగా ఇంట్లో వరుసలు తీర్చి బొమ్మలు పెట్టుంటే నేను ఒక్కొక్క బొమ్మ అందించుతుంటే నాకు బలే సరదాగా ఉంటుంది. పండుగ మూడు రోజులు నాతో పాటు మా చెల్లి, మా తమ్ముడు కలసి మా అమ్మతో పేరంటము పిలవటానికి ఇంటింటికివెళ్ళి వాళ్ళ ఇళ్ళలోని బొమ్మలు చూస్తుంటేకూడా కన్నులపండుగగా వుంటుంది.

ప్రతిరోజు వీధులలో హరిదాసులుపాటలు పాడుకొంటూ శ్రీమద్రమారమణ గోవిందో హరి అంటూ తెల్లవారుఝామున మేలుకొలుపు పాటలు పాడుతుంటే విన సొంపుగా వుంటుంది. గంగిరెద్దువాళ్ళు గంగిరెద్దును తెచ్చి దానిచేత దణ్ణం పెట్టిస్తుంటే చూడముచ్చటగా ఉంటుంది. మా అమ్మ పొద్దున్నే లేచి వాకిటిలో పెద్ద పెద్ద ముగ్గులు పెట్టుంటే, ఆ ముగ్గులు చూస్తూ వుంటుంటే నాకు ఎంతో సంతోషముగా ఉంటుంది.

సంక్రాంతి పండుగ మూడు రోజులు గ్రామములోనివారందరూ చాలాసరదాగా గడుపుతారు. కోడిపందెములు, ఎడ్ల పందెములు, పొట్టేళ్ళపందెములు ఒకరినిమించి ఒకరు హుషారుగా వేస్తుంటే విచిత్రంగా వుంటుంది. నెలలో ఒకరోజున సాయంత్రం వేళ సంధ్యగొబ్బెమ్మను పెట్టి గొబ్బి గొబ్బెమ్మ మొగలీ పువ్వంటి మొగుడు నియ్యావే అని గొబ్బికొట్టను కొట్టమని మా అమ్మ చెపుతుంటే నాకు ఎంతో సిగ్గు వేస్తుంది.

భోగిపండుగనాడు మా తమ్మునికి భోగి పళ్ళు పోస్తాము. వచ్చిన పేరంటాళ్ళకు బొట్టు పెట్టటముంటే బహుసరదా. పండుగ నాడు కొత్తబట్టలు కట్టుకుని ఇంటింటికి పేరంటానికివెళ్ళి బొమ్మలు చూస్తాము. నెల రోజులకన్నా పండుగ మూడు రోజులు చాలా సరదాగా ఉంటుంది. పండుగ ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తుంటాను. సంక్రాంతి పండుగకి మా అక్కయ్య బావా ఎప్పుడు వస్తారా అనికూడా ఎదురుచూస్తాను. మా అక్కయ్య నేనూ పేరంటము పిలవటానికి వెళ్ళుతాము. అన్ని పండుగలకంటే సంక్రాంతిఅంటే నాకుచాలా యిష్టము. ★



# సాటిలేని శ్రేష్ఠతకు అద్భుతమైన పనితనమునకు

## రెండు దివ్యమైన నేషనల్-ఎక్కో మోడలులు!



ఇవిగో, మీరు రేడియో ప్రసారములను దివ్యముగా విని ఆనందించుటకు చక్కగా పనిచేసే, అత్యంత శ్రేష్ఠమైన రెండు నేషనల్-ఎక్కో మోడలులు! అవి 'మాన్‌సూనైజ్' చేయబడినవి మరియు వాటితో ఒక సంవత్సరము గ్యారంటీ యివ్వబడుతుంది. మీ దగ్గరలోనున్న నేషనల్-ఎక్కో వ్యాపారిని వాటిని పెట్టమని నేడే వినండి!



మోడలు 717: బంగారు రంగు జాలరముతో, మరూన్ రంగు ప్లాస్టిక్ క్యాబినెట్. మోడలు యు-717: 6 వాల్వులు, 3 బ్యాండులు; 230 వోల్టుల, కరెంటు మీద పనిచేసే ఎసి/డిసి సెట్; మోడలు బి-717: 6 వాల్వులు. 3 బ్యాండులు; డ్రై బ్యాటరీ సెట్

రు. 250/-

అన్ని ధరలూ నెట్; స్థానిక పన్నులు అదనము

మోడలు 187: 8 వాల్వులు, 8 బ్యాండులు, అందమైన కర్ర క్యాబినెట్. మోడలు ఏ-187 ఏసి సెట్, మోడలు యు-187 ఏసి/డిసి సెట్ రు. 475/-



నేషనల్-ఎక్కో రేడియోలు శ్రేష్ఠమైనవి - అవి




చేయబడినవి




జెనరల్ రేడియో & అప్లయనెస్ ప్రైవేట్ లిమిటెడ్

ఒపేరా హౌస్, బొంబాయి 4 · 8 మదన్ స్ట్రీట్, కలకత్తా 13-1/18 మౌంట్ రోడ్, మద్రాసు. 36/79 సిల్వర్ జూబిలీ పార్కు రోడ్, బెంగుళూరు-జోగ్దియాన్ కాలనీ, చాందినీ, చౌక్, ఢిల్లీ. ఫ్రెజర్ రోడ్, పాట్నా.

GRA 6398

# రాజూ - రైతు

బాపు

౧


ఎవర్రా అక్కడ! వీళ్ళే బంధించండి...


వెనకనించి వచ్చిన భీమన్న..
చిత్తం ప్రభూ!


గంగన్న పారిపోతోంటే కన్నడు ఆగమన్నాడు


అయ్యో పడిపోయావా పాపం! లేమ్మా! లే!


పోనీ— పడుకోలే!


భీమన్నా! వీళ్ళిద్దరి కాళ్ళూ చేతులూ కట్టెయ్యి
17


సింగన్నా- నువ్వెళ్ళి భేరీ
మోగించిరా — వీరవర్మ దండు
మన సైన్యం వస్తోందనుకుని
కోటను ముట్టడించ-
డానికి
పరిగెడుతుంది


భేరీ మోతవినగానే
వీరవర్మ దండు
ఆదరా బాదరా
లేచి కోటవేపు
పరిగెత్తింది—


వీరవర్మ సైన్యం కొద్ది దూరం
వెళ్ళేసరికే విజయుడి సేనాని
చెట్లమీదనుంచి పెద్దసైన్యంతో
వారి మీద విరుచుకు పడ్డాడు-


సరిగ్గా ఆసమయానికే విజయుడి
మంత్రి మరో పెద్ద దండుని
కోటలోనుంచి పంపాడు


రెండు వైపులనుంచి హఠా
త్తుగా ముట్టడించిన
విజయుడి సైన్యం ధాటికి
వీరవర్మ దండు తట్టుకో
లేక పోయింది- వీర
వర్మ భటుల్లో ఓపిక-
అదృష్టం ఉన్నవాళ్ళు
పారిపోయారు- లేని
వాళ్ళు దారికి పోయారు-
18

ఇంతకీ చామంతిచెప్పిన నీతి :

# మందహాస

## 'ఎందుకు?' కాదు, ఎవరికి?

'నిజమాడితే నిష్ఠూరమన్న సామెత' గుర్తుకొచ్చింది పున్నయ్యగారి విమర్శ చదువుతూంటే "తల్లికి బిడ్డ బరువా? చెట్టుకి కాయ బరువా? అని నుడివిన పెద్దలు మందులా?" అంటూ ప్రశ్నించారు పున్నయ్యగారు. కుటుంబనియంత్రణ తప్పక అవలంబించమంటూ ఎన్నో విధాల నచ్చచెప్తూ, వైద్య సౌకర్యాలు కలిగించుచున్న ప్రభుత్వము గుడ్డిదా? నాయకులు, యితర పెద్దలూ మంగులా?

పోతే ఆహారపు కొరత ఒక్కటే కాదు. ఆరోగ్యంవృష్ట్యా చూసినా, అధిక సంతానం వల్ల ఎన్నో నష్టాలున్నాయి. అధిక సంతానం వల్ల, ఏటా కాన్పులచేత యిల్లాలి ఆరోగ్యం అడుగంటుతుంది. పిల్లలు బలహీనులవుతారు. వాళ్లకి అవసరమగు బలమైన టానిక్కూ, ఆహారం యివ్వడం అందరికీ సాధ్యం కాదు. సరైన తిండే పెట్టలేనప్పుడు, వాళ్ళకి చదువు సంధ్యలు మాత్రం ఎలా చెప్పిస్తారు? దాంతో బిడ్డలంటే ప్రేమకి బదులు విసుగు కలుగుతుంది. జీవితమంటేనే రోత కలుగుతుంది. జీవితానికి ఆశాజ్యోతులలా వెలగవలసిన బిడ్డలు, గుదిబండల్లా మన జీవితానికి భారంగా వుంటే ఎలా? ఇలాంటి దుస్థితికి రాకుండా వుండేందుకు నియమితసంతానం ఎంతైనా అవసరం! దానివల్ల అందరికీ సుఖం.

నేనోసారి మా ఫ్రెండ్ యింటికి వెళ్ళాను తను పెంచుతున్న చామంతితోట చూద్దుగాని రా! అంటూ తీసుకు వెళ్ళింది తోటలోకి. అప్పటికి మొగ్గతొడుగుతున్నాయి చామంతి మొక్కలు. అందులో ఓ మొక్కకి దగర దగర వందలు పైన మొగ్గలున్నాయి. చూశావా? ఎన్ని మొగ్గలు పెట్టిందో అన్నా మాసరూ (ఫ్రెండ్)తో! అరె! నేను చూడనేలేదు అంటూ గబగబా ఓ యిరవై మొగ్గలుమాత్రం ఉంచి మిగతావి తుంచి పారేసింది. నేనుగబుక్కుమన్నా అదేమిటలా చేస్తున్నావ్. మనసుక్కుచివుక్కుమనిపించి. "అరె పిచ్చిపిల్లా, నీకు తెలీదా? మొగ్గలు ఎంత తక్కువగా వుంటే పూలు అంత పెద్ద పెద్దవిగా పూస్తాయి, అందంగా నవనవలాడుతాయి. ఎక్కువ మొగ్గలుంటే బలం

### సి. ఉత్తర
### (షోలాపూర్)

---

## ఆ! ఆసూత్రం...

ముందు మనము వ్రాయదల్చుకున్న విషయాన్ని గురించి పూర్తిగా మన మనస్సులో ఆలోచించుకోవాలి. ఆ తరువాత మనమూ విషయములో గాఢవిశ్వాసము కలిగివుండాలి. అటుపిమ్మట మనమూవిషయాన్ని వ్యాసంగా ఎంతవరకూ వ్రాయగల్గామూ అని పరిశీలించుకోవాలి.

ముఖ్యంగా మనచుట్టుపక్కల వాతావరణము, సాంఘిక పరిస్థితులు మనకు వ్రాసే వోపికవుంటే, ఎన్నో కథావస్తువులను, వ్యాస విషయాలను సమకూరుస్తాయి. ఇంకోవిధంగా చెప్పాలంటే మనను ఆవరించుకొనివున్న సంఘము, వ్యాస విషయాలకు తరుగని గని వంటిది. కేవలము మనకు కావలసిందల్లా దానిని ఒక వ్యాసంగా రూపొందించటమే. మనమొక వ్యాసాన్ని పత్రికకు వ్రాస్తున్నామంటే మనసంఘములో మనకు కనిపించిన ఒక్కొక్క లోపాన్ని ఎత్తి చూపుతున్నామన్న మాట. మనమొక వ్యాసాన్ని వ్రాస్తున్నపుడు ఇన్ని విషయాలు మనవ్యాసములో వున్నవో, లేవో చూచుకోవాలి మన వ్యాసము అచ్చయినప్పుడు, చదివేవాళ్ళకు "ఇదేమిటబ్బా, ఇంత అసహ్యంగా వ్రాసారు" అనిపించే టట్లుగాక, మనము వ్రాస్తున్న విషయము "నిజమేసుమా" అని వాళ్ళ కనిపించేటట్లు వుండాలి. ఇవన్నీ లేక, మనము వ్రాయలేకపోక, వ్రాసేవాళ్ళను చూచి బాధపడటము, లేక మనవ్యాసాన్ని తిప్పి పంపినప్పుడు పత్రికవాళ్ళను తిట్టుకోవటము భావ్యము కాదు. ★



రంగవల్లి

— ఎ. వి. ఎస్. ఆర్. [illegible]

# అందంగా అలంకరించుకోవడం తగదా?

ఏదైనా చెడు ఎక్కడున్నా జరుగుతుందని గాని లేక ఒకరివల్ల వేరొకరు ఇబ్బందులకు గురిఅవుతున్నారనిగాని విన్నప్పుడు ఏ విధంగా ఆ చెడ్డని హతమార్చాలి, ఏ ద్వారాన ఆ అన్యాయాన్ని అరికట్టాలి అని ఆలోచించటం బుద్ధిమంతుల లక్షణం. అంతేకాని పాక్షికంగా స్వార్థవాదంతో కాలం వెళ్ళమార్చటం వ్యర్థమవుతుందేతప్ప కార్యగతికి దోహదమివ్వజాలదు.

ఒక వారపత్రికలో కరీంనగర సోదరి తనగోడు వెళ్ళబుచ్చింది. గ్రుడున పదిరోజులు తిరిగినవో లేదో అప్పుడే అర్థరహితమైన వ్యాఖ్యలు కల్పబడ్డాయి. ఇలా అయితే యిక లోకంలో అన్యాయాలకు తిలాంజలు లివ్వటం ఎప్పుడు? ఆంధ్రదేశంలో ప్రతీచోటా అన్నో, అంతకు అన్నో విద్యార్థినులు బాధపడుతూండటం చూస్తూనే వున్నారు. నిజాయితీ ఘనీభవించిన వాళ్లయితే ఆమె వ్రాసినదానికి సానుభూతి తెలియపరచాలి. చేతనయితే అటి అకార్యాలను నివారించ మార్గం ప్రయత్నించాలి. అంతేగాని మన పేరు అన్నవుతుందన్న దృష్ట్యా పరిసితుల వరం చేసుకోకుండా క్రిటిక్ పోజు వేసి ఏవో నాలుగు ముక్కలు వ్రాయటం సమంజసం కాదు. ఇలా వ్రాయటంవలన సమస్యలు పరిష్కారం కావు సరిగదా వ్యగ్రభేదం ఇనుమడిస్తుంది. సహకారం నశిస్తుంది. సద్భావం అడుగంటుతుంది.

7-1-59 సచిత్ర వారపత్రికలో లేఖలు చూస్తుంటే పై ఉద్దేశమే కలుగుతుంది తప్ప కార్యమార్గం కాసకూడా కనుపించటం లేదు.

ఇలా జనతా కరీంనగరసోదరిని దుయ్యబట్టేకంటె కార్యాచరణలో తమ కాలాన్ని వినియోగిస్తే చాల సత్ఫలితాలు కలుగుతవి. అంతేకాని వాద ప్రతివాదాలతో యీ సమస్య పరిష్కారం కాగు.

—బి. విశాల బి. ఎ.

ఆంధ్రపత్రిక (7 వ తేదీ)లో, "వనితాలోకం" క్రింద శ్రీ నరసింహారావు చౌదరి గారు, విద్యార్థుల పట్ల సానుభూతి చూపినందులకు వారి విశాల హృదయమును అభినందించ లేకుండా ఉండలేము కాని,ఆయన తోటి విద్యార్థులను అపార్థం చేసుకొన్నారని మా అభిప్రాయము. అమ్మాయిల కాలేజీకి జీతం (సంవత్సరము కొన్ని వేలు ఖర్చుపెట్టి) కట్టి కాలేజీకు పోవ అవసరము లేదు. హాయిగా, కాలేజిగేటు ముందర ఆయన చెప్పినట్లు "నీటుగా" డ్రస్ చేసుకుని అక్కడ కావలసినన్ని పోజులు కొట్టవచ్చును. సెలూరు కళాశాలలో జరిగిన ఉదంతము (7 వ తేదీ ఆంధ్రపత్రికలో) స్మరించే ఉంటారు.

ఆడవారు మాత్రం అతిగా అలంకరించుకుని కళాశాలలకు వచ్చుటలేదా? అయన గారు, ప్రత్యేకంగా మగవారినే విమర్శించడంలో ఉద్దేశమేమి? "నీటు"గా డ్రస్ చేసుకోకుండా, కాషాయము ధరించి కాలేజీకి వెళ్ళమని వారి ఉద్దేశ్యమా?

—విద్యార్థి సోదరులు,
తిరుపతి.

కరీంనగరి సోదరి వ్రాసిన విద్యార్థుల నైతిక విలువలు అనునది చాలా బాగున్నది. ఆడపిల్లలలోను మగవాళ్ళలోనూ అల్లరి చేసే వాళ్ళు ఉంటారనేది నాకే కాదు అందరికీ తెలిసిన విషయమే. పోతే ఒక అమ్మాయిని పట్టుకొని ఏడ్పించడం ఈనాటి విద్యార్థులకు బాగా అలవాటయింది. ఆమె కొంచెం అందగత్తె కాబట్టి ఆ అమ్మాయినే ఏడిపిస్తారు. ఎంత సింపుల్ గా ఉన్నా, తలవంచుకొని వెళ్ళినా పలుపేర్లతో పిలవడం, రోడ్లపైన, కాలేజీలలోను పెద్ద పెద్ద అక్షరాలు ఆమె పేరుపై వ్రాయడం నేడు అందరూ చేస్తున్నది. సినిమాస్టార్ పేరు పెట్టుకోవడమే ఈ రోజుల్లో పాపంలాగుంది. "హారూ" అనో, "సత్యవంతుడు వస్తున్నాడూ" అనో పెద్ద కేకలు వేస్తారు. అమ్మాయి రిపోర్టు చేయుటచే కొన్ని పేపర్లయిన 'అరుణ'లో ఏవేవో వార్తలు కల్పించి వ్రాశారు. ఆడపిలలు ఇలా అవమానాలపాలైతే ఇక జీవితాంతము వరకూ ఈ మచ్చ ఎలా పోతుంది? ఏమైనా ఆలోచించారా ఈ పెద్ద మనుషులు అయిన విద్యార్థులు.

—ఒక సోదరి

విద్యార్థులకు నెమ్మదిగా నచ్చచెప్పమని బి. సుచరితాకిషన్ గారు వ్రాశారు. అడకువగల స్త్రీలు అలా ధైర్యంగా అడగరు. అడిగినా వారగౌరవానికేలోటు. ఈవిషయంలో నేను "సుచరితాకిషన్" గారితో పూర్తిగా ఏకీభవించలేకపోతున్నాను. కాబట్టి "సీతాపతిరాజుగారు" వ్రాసినట్లు సోదరులకు సోదరులే నచ్చచెప్పుకోవాలి. టి. భూమాదేవి.

అన్నిటికి తగినవుందు ప్రత్యేక కళాశాలలు ఏర్పాటుచేయుడము. మరి వారికి ఈ బాధలు ఉండవు. కామన్ కాలేజీలలో చేరి యీ గేలింపులతో కాలం గడుపుతూ చదువు పాడుచేసుకోటంకన్నా ప్రత్యేక కళాశాలల్లో చేరడము మంచిది;

విద్యార్థుల తలిదండ్రులను తమ పిల్లలకు శిక్షణ ఇవ్వనివారిలా చిత్రించడం సబబనిపించదు. ఈ విషయాల రిపోర్టులు సాధారణంగా తలిదండ్రులవరకు పోవు. అందుకని వారికి విషయము తెలియకుండా నేవుంటుంది. తెలిసినా దానిని సాంఘిక "దౌర్బల్యము" క్రింద జమకడ్తారు. కాని వ్యక్తిగతంగా తీసుకోరు. —అకుల రామేశ్వరి.

"తప్పులన్నియు విద్యార్థినులలోనే ఉన్నవి. ఒక్కొక్కసారి విద్యార్థి ఎవరైన హేళన చేసినచో అక్కడే నచ్చ చెప్పుట మంచిది. కాని అటు చేయక చిటికి, మాటికి 'ప్రిన్సిపాల్' వద్దకుపోయి రిపోర్టు ఇచ్చుట మంచిదకాదు. (ఒక విద్యార్థి బళ్లారి)

బెజవాడనించి వ్రాసిన విద్యార్థిని కావాలని వ్రాసిందో లేక ఊరకనే వ్రాసిందో తెలియదు. పాపం ఆ విద్యార్థినికి మాత్రం అందరు విద్యార్థులు తగాదాలు చేస్తారని ఒక్కతే తెలుసు కాబోలు! ఆ విద్యార్థినికి తమ్ముళ్లు కాని అన్నలు కాని లేరు కాబోలు' విద్యార్థినులు చేసేగొడవకు విద్యార్థులు చేసే గొడవకంటె వేయిరెట్లు అధికం!

—"ఊర్మిళ!"

24-12-58 సంచికలో వ్రాసిన ఒక విద్యార్థిని (బెజవాడ) విద్యార్థినుల బాధలు వ్యాసం చాలాబాగా వ్రాశారు. బెజవాడలోనే కాదు. చాలాపట్నాలలో అలాగే ఉంది. కరీంనగర్ విద్యార్థిని వ్రాసినదికూడా బాగుంది. ఆ ఇద్దరికీ నా సానుభూతి.

—లక్ష్మి.

## కారణం

విద్యార్థులు అలరి పెడతారు కాదనను. అయితే వీరు అల్లరిపెటడానికి కారణం ఆడపిల్లలు ఇచ్చిన అలుసే.

—మాగళ్ళ రామకృష్ణ.

# వనితా వాణి



## జీబ్రాచారలు తెలుపా నలుపా?

నవంబరు 19 పత్రికలో నేను వ్రాసిన 'ఇది నిజమేనా' అను వ్యాసాన్ని విమర్శిస్తూ శ్రీమతి రంగనాయకమ్మ "ఎందుకొచ్చిన వాదాలివి" అన్నారు. కాని కొన్ని విషయాలు మాత్రం వ్రాయాలనుకుంటున్నాను.

శాస్త్రజ్ఞులు కొన్ని సంవత్సరాలుగా ప్రయోగాలు చేసి నిర్ధారణ చేసిన విషయాన్నే ధైర్యంగా వ్రాశాను. స్వకపోలకల్పన కాదు. సందేహ నివృత్తికోసమూ వ్రాయలేదు.

ఈ విషయం "కళ్ళయెదుట కన్పించే నిజం" అని మనకెలా తెలుసు? స్వీయానుభవ పరానుభవాలవల్ల యేర్పడ్డ వూహాలను "కొన్నింటిని" నమ్మలేము. ఆ కొన్నింటిలో చేరింది. కనుకనే మనం నిర్ధారణ చేసికొని నమ్మలేనివాటి నిజస్వరూపంకోసం శాస్త్రజ్ఞుల కృషిఫలితాలకోసం తాపత్రయపడాము. మన ఈ స్థిరపడిన భావాలు పూర్తిగా నిజం కావచ్చు, అబద్ధమూ కావచ్చు, కొన్ని అటీయిటీ కావచ్చు "నిజం" అని తెల్పుకుని మన "మనస్సులలో" నమ్ముతాము. కానీ లాభమేముంది స్థిరపడిన భావాలలో యుక్తాయుక్తాలు గ్రహించాలి కదా! సైకాలజీని జీర్ణం చుకోవటం కష్టమే-మానవజాతి పెరిగినా సృష్టితీరు ఒక్కటేకదా? అయినా దానిపై ఎప్పుడూ పరీక్షలు జరుగుతూనే వున్నాయి. కారణం? పూర్వపు మానవ ప్రవర్తన సిద్ధాంతాలలో మార్పు లేమైనా వచ్చాయేమో తెలుసుకునేందుకే-దాన్ని బట్టి తేల్చింది వారిలో తెలివితేటల్లో భేదం లేదనే. అలా మార్పువస్తే అపూర్వసత్యాన్ని ఖండించి క్రొత్తది రూపొందుతుంది. ఈ క్రొత్తదాన్ని లోకం గ్రహించాలి. అంగీకరించటం అంగీకరించక పోవటం వ్యక్తిగత విషయాలు. కానీ నూత్న విషయాలు తెలుసుకోవచ్చును. అది మన యిష్టమే. దాని విషయమై అనుమానాలు పుట్టవచ్చు. అయితే "ఒక్క సంఘటన శాస్త్రవిరుద్ధంగా జరిగి సత్యం ఒక్కొక్కసారి తారుమారౌతుం"దన్న అనుమానంతో అసలు నమ్మటమే (అన్ని విధాలా ఋజువై సత్యంగా గోచరిస్తే) మానేస్తామా?

కళ్ళకు కన్పించే నిజాల్ని నమ్మకపోతే కష్టమేగాని "మన సత్యం మాత్రం కళ్ళకు సూటిగా కన్పించినా, వాటి విషయం 'మనం" ఒక నిర్ధారణకు రాలేము. అవి సత్యంలా గోచరించినా, కొన్నిసార్లు సత్యం కాకపోవచ్చు. సామాన్యులమైన మనకు మానవప్రవర్తన సులభగ్రాహ్యం కాదు. శాస్త్రజ్ఞులు పరీక్షించి తెలిసికొన్న సిద్ధాంతాలు కాబట్టి మనం వాటిని తెలుసుకోవాలి. (అందుబాటులో నున్నప్పుడు) ఎందుకంటే మన దైనికజీవితంలో మనం యిలా పరీక్షించలేము కాబట్టి.

సత్యమే కాని దానిని ఏ వేవో "ఋజువులు, ఆధారాలు" చూపించి ఎవరూ నమ్మించరు. అలాంటిపద్ధతి "గలిలియో"కు పూర్వం అనుసరించారు. తరువాత యీ

పోకడ మారింది. అవి అసత్యమైతే వాటిని నమ్మటం మాని క్రొత్తదాన్ని అంగీకరిస్తాము అంతేకాని వారికి "తాళం" వేస్తున్నామనుకుంటామా!

"యావరేజ్ మీద తెలివైన స్త్రీలే యెక్కువ వనిపిస్తుంది" అని ఒక నిర్ధారణకు వచ్చినట్లయితే "ఎక్కువ" అనాలి. కానీ "అనిపిస్తుంది" అని అంటే రూఢిగా తెలీనట్టే. స్వీయానుభవంలో తేల్చిన విషయమైతే నొక్కి చెప్పవచ్చు.

నచ్చచెప్పాలంటే ఋజువులు కన్పించకపోవచ్చు, కానీ తేట తెల్లంగా వున్న సుస్థాపిత సిద్ధాంతాలను (Standard theories) "మనం" మన స్థిరపడిన భావాల ఆసరాగా తారుమారు చేయలేము.

వ్యాసం చదివిన కొందరు తమ స్వీయానుభవం etc లతో తేల్చుకున్న విషయాన్ని నాతో అన్నారు, "అసలు చూస్తే స్త్రీలకంటే పురుషులే తెలివైనవారేమో" అని. ఈ సందర్భంలో గట్టిగా చెప్పలేక — "వారేమో!" అనీ, "అనిపిస్తుంది" అనీ వాడారు. మన కెన్నో అనిపిస్తాయి; ఎమ్మెస్సీ జీబ్రామీదవి నల్లని చారలు కావట! తెల్లని చారలట! అని మొన్ననే చదివాను ఒక పుస్తకంలో. ఏదినిజం?

నిజమే. తెలివితేటలలో స్త్రీ, పురుషులకు (లేక బాలబాలికలకు) భేదం లేదని నమ్మి వ్రాసినంత మాత్రాన ఆ సిద్ధాంతాన్ని బలపర్చింది, లేదు; నమ్మటానికి సంశయిస్తూ తమ అనుభవాల పట "లక్ష్యం" చూపి "అలా అనిపిస్తుంది" అన్నంత మాత్రాన దాని విలువను తగించింది లేదు.

స్త్రీ పురుషుల తెలివితేటల్లో తేడా లెవ్వడం అందులో యీ కాలం నాకంత సమంజసంగా తోచదు ఇందులో సోదరి రంగనాయకమ్మ నాతో యేకీభవిస్తారేమో!

ఏదైనా గ్రహించితే నష్టం లేదు. తెలియనివి తెలుసుకుంటే లాభమే మనకు. ఒప్పుకుని తీరాలని పట్టుదల లేదు. లేకపోతే, మన భావనాశక్తి కందని విషయాలను, మనం యితరుల సహాయంతో అకలింపు చేసుకోవచ్చునని నా భావం. ఆ యితరులు శాస్త్రజ్ఞులే (ఈ సందర్భంలో మన సత్యశాస్త్రజ్ఞులే) అందుకే శాస్త్రాలతో ముడిపెట్టుకుని — విశ్వసిస్తాము

డి. కోమలాదేవి (కాకినాడ)

* * *

ప్రపంచము రాను రాను రాకెట్లు, స్ఫుట్నిక్కులతో పురోభివృద్ధి గాంచుచున్న ఈ 20వ శతాబ్దములో మానవుడు తన మేధస్సుతో ఈ విశ్వమునే తన చెప్పు-చేతల్లో పెట్టుకొని ఆకాశమునకే నిచ్చెనలు వేస్తున్న ఈ కాలములో గంగరాజు వెంకట పున్నయ్యగారి సనాతన అభిప్రాయములకు తావు లేదని గ్రహించుదురుగాక!

కాబట్టి, వనితలు ఇకనైన బి. సి నాటి తలంపులకు తావీయక "కుటుంబ నియంత్రణ"కు ముందడుగు వేయుటకు సంకోచించరని నమ్ముచున్నాను.

జి గోపాలస్వామి (కాకినాడ).

* * * *

పి. రావుగారు (కాకినాడ) శీర్షాసనమును గూర్చి చక్కగా వివరించిరి ఆరోగ్యసంపాదనకు చాల అనువుగా నున్నది. వారికి నా ధన్యవాదములు.

వి వెంకటేశ్వరరావు.

* * *

"మధురానుభూతి కల్గించే కార్తిక పౌర్ణమి సముద్రస్నానము" వ్యాసము చాల బాగుంది, ప్రభుత్వమువారు వచ్చే కార్తిక పౌర్ణమికి తగు కట్టుదిట్టంలు చేయుదురని ఆశిస్తున్నాను.

కె. రాజరత్నం (భిక్కనూరు.
—నిజామాబాద్)

* * *

8-12 58 పత్రికలో జి. యస్. వాణిగారు యిచ్చిన నెట్ క్లాత్ మీద డిజైను చాలా బాగుంది. మా పాపకు స్వెట్టరు కుట్టాను. బాగా వచ్చింది. చాలా తేలిక. ఎంతో ఉపయోగంగా ఉంది. ఈ చలికాలంలో చక్కగా కుదిరింది. ఈ ప్రకారం ఎన్నో మాదిరిలు కుట్టుకోవచ్చు. ఈ పత్రిక ద్వారా వాణిగారికి నా అభివందనములు తెలుపుచున్నాను.

— జి. యస్. సుశీల, పోలవరం.]



 

# మన్ననిపంటు



(36-వ పేజీ తరువాయి)

"ఆఁ ఏ విటావిరగబాటు, ఎవరైనా చూస్తే హిస్టీరియా అనుకోగల్రు!" యీ వింత పరిస్థితికి ఆశ్చర్యపోతూనే మందలించేడు జానకి రామయ్యగారు.

ఈ ముక్క ఆవిడ చెవినిపడనే లేదు. సముద్రపు కెరటాలాగ తెరలు తెరలుగా పొంగివొస్తున్న నవ్వు ఆపుకోలేక, శేలెన్ను తిప్పి, తబ్బిబ్బయి అమాంతంగా చెయ్యి టేబిలుమీదికి చాపి తనూ వాలిపోయింది ఆ చేతిమీద. అయిదునిముషాలయినా, ఆ నవ్వుకి ఆమె ఊర్ధ్వభాగం అలా అదురుతూనే ఉంది; తలలో పువ్వులగుత్తి అలల్లో కొట్టుకున్నట్లు అలా కదులుతూనే ఉంది, కిందికీ మీదికీని.

"ఎందుకలా యిదయిపోతున్నావ్, చెబుతూ ఉంటేనూ!" హెచ్చరించేడు జానకిరామయ్యగారు. అప్పటికీ ఆమె నవ్వు ఆగలేదు. మరి మాటలేకుండా, అలా నవ్వుతూనే తన చేతిలో ఉన్న అన్నకుబుక్కు ఆయనచేతిలో పెట్టింది. "శ్రీరాములవారి దయ" అన్నరు పుస్తకం కవరుమీదనే ఎవడో స్ఫుటంగా యిష్టదైవతా ప్రార్థన చేసుకున్నాడు. "అమ్మ నాయినా, యీ వెధవలకి ఏం సాంకేతికాలు!" అనుకున్నాడు జానకిరామయ్యగారు. రీనంబరింగు అక్కడికి కట్టిపెట్టి పేపరు తణఖీ చెయ్యడం ఆరంభించేడు. ఓ దానికి మధ్య కుట్టు ముడిమీద సిరా పూసి ఉంది. యింకో పేపరుకి చిట్టచివర అన్నగు పేజీమీద * గుర్తుంది; మరో దానికి మానో చిన్న కలవపువ్వు చిత్రించేడు ఓ కళాకారుడు అన్నగు ఆలోచిస్తూను. అలా చూస్తూన్న కొద్దీ పరిపరి విధాల కొంటెకుసులు. తీవ్రంగా ఆలోచించేడు జానకిరామయ్యగారు. పావుగంటలో స్ఫురించింది పెయితు. ఆపాశంగా భార్యాభర్తలు యిద్దరూ కూచుని యింపోజిషను రాయడానికి ఆరంభించేరు. అక్కడక్కడ ఏరి తీసి ఓ పది పుస్తకాలమీద "శ్రీరాములవారిదయ" అని రాసేరు; మరో పదిహేను పుస్తకాలకి మధ్య కుట్టుముడి మీద సిరా పూత పూసేరు. యింకో యిరవై యింటికి మార్జనలో కలవపువ్వులు వెలిసేయి; వేరే కొన్నింటికి "బికాజు" మార్కులూ, "దరిఫోర్" గుర్తులూ—ఆ రాత్రిలా అదేపనీ ఆ దంపతులకి!

దిద్దడానికి వొచ్చేయి పేపరు మేష్టర్లకి. చాలా గప్‌చిప్‌గా యీ సంగతి కావలసిన వాళ్ళందరికీ తెలిసిపోయింది. పిల్లల తండ్రులూ, పినతండ్రులూ, మేనమామలూ, తదితర గార్డియన్లూ వొచ్చి యీ ఆచార్య దేవులని యథాశక్తిగా సేవించుకుంటూనే ఉన్నారు. బేరాలు సాగిపోతూనే ఉన్నాయి.

"ఓ మండలం చదివించుకో - బహుశా! వలుకుగు కలిసే సాయంపట్టాలి మీవాణ్ణి యీ కేష్మైనా కిటాలా?"

"బాబ్బాబు! నలభైరూపాయిలిచ్చుకోమంటే నచ్చిపోనూ, పిల్లాణ్ణి!"

"ముప్ఫయిసావంటావు. అవునా? ఊఁ కానీ మొదట్నించి తెలుసున్నవాడివి కాబట్టి కాదనడానికి కుదరదు. ఊఁ. సాయంకాలంలోపల యిచ్చేసుకో."

"తోఁకు ముప్ఫయ్యంటేటి సేసేది బాబూ. తోఁకు కుంతోలో సంపాలకానీ"

"అయితే యేఁవిటంటావ్? పాతికయిస్తే ముట్టచెపాావా లేదా? మాఁకావా, యింకా ఎన్ని పేర్లున్నాయో దిద్దవలసినవి! వాళ్ళంతా వొస్తారు. మరి ఓ ఖుర్రనీతో నె కూచుంటే మాకు పనెలాగ అవుతుంది?"

"సిత్తం బాబు. పొద్దు గూకుటికొడోతాను."

"ఆఁ, వెళ్ళు. చూడూ, సాయంకాలం వొచ్చినప్పుడు మీకుర్రాణ్ణికూడా తీసుకురా."

"అదెందుకు బాబూ? మళ్ళి రాయిత్తారేటి? సవించిందంతేడు మరిసేపోను!"

"అది కాదురా. వాడి పేపరేదో వాణ్ణి పోల్చుకుని తీసి ఇయ్యాలి. పేపర్న్నీ కలగాపులగం అయిపోయేయి, వెధవ రాతలూ వీళ్లూనూ!"









# సమర్పణ



(11-వ పేజీ తరువాయి)

"అప్పుడు ఈ కర్మ అవీ ఇవీ గొంతుకు ఉరి పోసుకున్నారా?" అంది శ్యామల.

మెరుపుదెబ్బ కొట్టినట్లు అయ్యింది శ్రీపతికి. "రెడ్డి ఏమన్నాడో తెలుసా?" అన్నాడు.

"ఏమంటాడు మనని వెలివేయిస్తానంటాడు కసి తీర్చుకోడానికి." అవధాని సమాధానం చెప్పేడు.

"నాన్నగారు ఉరేసుకుంటారు ఇవన్నీ తెలిస్తే..."

"ఎవరూ చేసుకోనక్కర్లేదు. నేను కేచిని ఎల్లుండి తీసుకువెళుతున్నా."

"నాన్నా అమ్మ రాకుండానే?"

"అమ్మకు తెలుసు."

"ఆ!" అంటూ గోడకు చారబడిపోయేడు శ్రీపతి!

"ఇంక నాన్నగారికో, అది నువ్వు చెప్పు."

"చెప్పండి. ఇంటికి ఓ విధంగా పెద్దలుగా" కాంతమ్మ ఊతపదం అందించింది.

శ్యామల ఉలిక్కి పడినట్లుగా—"చిన్నమరిది! దీనమ్మను ఏ స్కూల్లో నేనా చేర్పి ఆ పట్నవాసంలో చదివించెయ్య. తర్వాత దానికి నచ్చిన ఈడు జోడు అయినవాణ్ణి వెతికి..."

"మా చెల్లెలే చేసేసుందిలే అక్కయ్యా! మనం అంటే వంటింట్లో మగ్గిపోయేవాళ్ళం. అదా! మెరికల్లాంటిది..."

నవ్వుకున్నాడు అవధాని, కసి పిసుతో లోపలికి తుర్రుమంది.

ఒక్క శ్రీపతే తెప్పరిల్లలేక, కళ్ళప్పగించి గుటకలు వేస్తూ కూర్చున్నాడు. ఏమనాలి, ఏంచెయ్యాలి అన్న నిర్ణయం లేని స్థితి, ఆవహించింది. శిలాప్రతిమ అయిపోయాడు. అంతా శూన్యంగా గోచరించింది!

"ఆ! మర్చిపోయా మరిది! మీ అన్న వూరికి వీరేశలింగంగారి శరణాలయం దగ్గిరేమో!" అంది చిన్నావిడ.

"కాని ఒదినా నా దగ్గిరే వుంచుకుంటా..."

"వెయ్యేళ్ళు వర్ధిలు నాయనా" అంటూ కళ్ళు తుడుచుకుంది.

ఒక్క పర్యవలోకనంలో శ్రీపతికి ఓ ప్రళయం వచ్చేసినట్టె తట్టింది. అందులో తను కూకటి వేళ్ళతో పెళ్లగింపబడే కలవృక్షం అయిపోతున్నానన్న భీతికల్గింది. దీన్ని ఎల్లా తట్టుకోవాలా అన్నది ఎంతగా ఆలోచించినా తట్టనేలేదు. అడ్డు పెడితే వెళ్ళనివ్వకపోతే, ఇల్లా పుట్టగొడుగులు వచ్చేయి. మనస్సు అంతా వికలమై పోయింది.

నిజంగా సింహావలోకనం చేసుకుంటే తనకున్న వ్యక్తిత్వం ఏమిటి? ఇంట్లో తన స్థానం ఏమిటి? అన్న ప్రశ్నలకు కొంగడా చేసినా సమాధానం దొరకటం లేదు. తను ఓబానిస. నాన్నగారి ఆదేశాల్లో, అన్నగారి వాక్కుల్లో నలిగిపోతున్న. కటకం అంతకన్న ఔచిత్యమైన సమాధానం రానే రావటం లేదు.

అవధాని తనకన్న చిన్నవాడైనా, మొట్టమొదటనుండి నాన్నగారిని, అన్నగారిని మొరాయించి స్వతంత్రుడే అయ్యేడు. ఆ స్వతంత్రంలో కొ విప్లవాత్మక బీజాలు నాటుకున్నాడు. ఆలోచిస్తే తనకన్న ఎన్నోరెట్లు అభ్యుదయం కలవాడేమో అనిపించింది.

నిలబెట్టి అడిగితే తనకిమాత్రం కూచి సుఖంగావుండడం, దాని సంసారం మూడు పువ్వులూ ఆరు కాయలుగా వృద్ధిపొందడం ఇష్టం లేకపోలేదు. ఈ కార్యాచరణలో అవధాని ముందంజవెయ్యడం, తనే దద్దమ్మలా ప్రదర్శనపు బొమ్మఅవడం మనస్సును క్షుభితం చేసేసింది.

ఉండలేక బయటకు వచ్చేడు. ఏం చెయ్యాలో పాలుపోక పచారుచేస్తు ముందు వాకిట్లో క్రటాళ్ళు, గడలు లెక్కపెట్టే ధోరణిలో వచ్చి పడిపోయాడు.

ఉరుకులమీద వెంకటస్వామి "అయ్యగారు, చూచేరా ఏంజరిగిందో! రేపు వరిచేను కోతలనుకున్నాము! ఇవ్వాళ రెడ్డి, సూర్పరాజు, మాలవెంకడు, చాకి పశువులన్నిటిని చేలోకి తోలేసేరు. నానా బాడవ అయ్యిపోయింది. పెద్దదెబ్బలాటే అయ్యింది కూడా" అన్నాడు.

'ఆ' అంటూ కొంచా దాటేడు శ్రీపతి. అవధాని వెనక నడిచేడు.

—ఇంకావుంది.]










# దక్షిణ భారతంలో ఫిలిం పరిశ్రమ

ఫిలింకంట్రోలు ఉధృతంగావున్న 1958లో చలనచిత్ర వ్యాపారం అతిపూర్వం ఎన్నడూ అందుకోనంతటి స్థాయికి పెరిగింది. సెన్సారయిన చిత్రాలసంఖ్య ఎక్కువ. ఖర్చయిన ఫిలిం ఎక్కువ. ఇవిగాక, అటు స్టుడియోల, ఫ్లోర్లసంఖ్య, మరోవంక సినిమాలసంఖ్య కూడా పెరిగినటు ఫిలిం వాణిజ్యమండలివారి వార్షిక నివేదిక తెలియజేస్తున్నది. ఇది నిజమైన పెరుగుదల కాదేమో, బహుశా ఫిలింకంట్రోలు దెబ్బవల్ల సంభవించిన వాపు కానోపునని ఒక నిరాశావాది అన్నారు గాని నిష్పాక్షికంగా పరిశీలిస్తే అది కేవలం అపోహ అని అనిపిస్తుంది.

1958లో సెన్సారుఅయినచిత్రాలసంఖ్య 120. క్రితం సంవత్సరంకన్న 11 ఎక్కువ అన్నమాట. భాషలవారీగా చూస్తే ఈ 120 లోను తమిళం 61, తెలుగు 36, కన్నడం 11, మలయాళం 4, హిందీ 8. తమిళ చిత్రాల సంఖ్య ఒక్కసారిగా 46 నుండి 61 కి పెరిగింది. తెలుగువారి తమిళ వెర్షన్లకు ఇందులో ప్రముఖభూమిక ఉంది. (ఇవి సెన్సారు అయిన చిత్రాల వివరాలు విడుదల అయినవి కావు) వీటిలో స్టూడియో అధిపతులు తీసినవి 28, స్వతంత్ర నిర్మాతలు తీసినవి 48, కొత్తవారు నిర్మించినవి 44. అందరిలోను ఎక్కువ చిత్రాలు (ఏడు) తీసిన కంపెనీ పద్మినీ పిక్చర్స్.

జాతులవారీగా చూస్తే సాంఘిక చిత్రాలదే అగ్రస్థానం. అవి 78 తేలాయి. వీటిలో కొన్ని మారువేషం వేసుకున్న జానపదాలు ఉండవచ్చు. పౌరాణికాలు 23. చారిత్రకాలు జానపదాలు 24

ఒకే కథతో రెండు భాషలలో తయారైనవి కలుపుకుని లెక్కవేస్తే ఈ 120 చిత్రాలకీ 56 కథలున్నట్లు తేలింది. చట్టాలు వేరైనా చిత్రాలు ఒకటే అన్న సూత్రం పట్టిస్తే బహుశా ఒకటో రెండో కథలు రూపాంతరాలూ నామాంతరాలూ [illegible]యనవచ్చునని ముఖ్యంగా తెలుగు తమిళ చిత్రాలు చాలవరకు చూసిన ఒక ప్రేక్షకుడి తాత్పర్యం. తనమాట నమ్మలేనివారు వచ్చేయేడాది కథలుచూసినా దాఖలా దొరుకుతుందనికూడా ఆయన ధైర్యం.

డబ్బింగ్ చిత్రాలుకూడా ముమ్మరంగా వచ్చాయి. వాటిసంఖ్య 37. తెలుగులో 18. ఇవి మొత్తం తెలుగు చిత్రాలలో మూడోవంతు. గ్రాంథిక, వ్యావహారిక, పి వి ద్రూ, 'తెలుగు'ల ప్రక్కన డబ్బింగీస్ తెలుంగు కూడా ఒక విశిష సంపాదించుకోవడానికి యథాశక్తి ప్రయత్నిస్తోంది.

సంవత్సరం మొత్తంమీద సెన్సారయిన ఫిలిం నిడివి 18 లక్షల 75 వేల అడుగులు (షూట్ చేసినది మరికొన్ని మైళ్లు ఉండగలదు) 1957 లో ఇది 171 లక్షల అడుగులు; 56 లో 151 అడుగులే. ఈ యేటి 18¾ లక్షల లోను తమిళ చిత్రాల వాటా 9½ లక్షల అడుగులు, తెలుగు చిత్రాలది 574 వేలు. కంట్రోలు ఉండాలకే వారికి ఈ వివరాల జవాబు చాలు అని పారిశ్రామికుల అభిప్రాయం.

దక్షిణ భారత చిత్రాల నిడివి సగటున యేడు 2 11/12 మైళ్ళకైక 15,400 అడుగులు. ఇది నియటేకన్న ఒక ఫర్లాంగు గజాలు తక్కువచేసి) తక్కువ. ఫిలిం



విజయవారి 'అప్పుచేసి పప్పుకూడు'లో సి. ఎస్. ఆర్., జమున.



“ఢిల్లీ కా ఠగ్” లో నూతన్.

నిర్మాతల తీర్మానం (నిడివి 15 వేలకు మించరాదని) విడివిడిగా ఒకొక్క చిత్రంలోనూ పాటించకపోయినా సగటు నిడివి అయినా కొంత తగ్గడం ముదావహం. తెలుగుచిత్రాల సగటు నిడివి 16 వేలా కులాసాగా ఉంది...

చిత్ర నిర్మాణంతో పాటు నిర్మాణ కేంద్రాల పరిమాణం, ప్రదర్శన శాలలసంఖ్య కూడా పెరగడం ముదావహం. ఇప్పుడు మద్రాసులో 27 స్టుడియోలున్నాయి. వాటిలో 73 ఫ్లోరులున్నాయి. బొంబాయిలో స్టుడియోలు 30; ఫ్లోర్లు 69 కలకత్తాలో స్టుడియోలు 11, ఫ్లోర్లు 30; ఈనాడు దక్షిణ భారతంలో నిర్మాణంలో ఉన్న చిత్రాలసంఖ్య అన్ని భాషలూ కలిపి 387. వీటికి నిర్మాతలు 184 గురు. సినిమాల సంఖ్య 1958 ఏప్రిల్ 30 నాటికి 1063. వీటిలో 355 పక్కా సినిమాహాలులు. 708 టూరింగు సినిమాలు 1957 లో వీటి సంఖ్య: 329 పక్కా సినిమాలూ, 656 టూరింగు సినిమాలూను.

సెన్సారు వారు సర్టిఫికెట్ ఇచ్చే రేట్ల పరిమితి 5 నుండి పదకొండుకు పెంచి, కొత్త సర్టిఫికెట్లు తెచ్చుకునే ఫీజు కొంత తగ్గించినా, కొత్త ప్రతులు తీయడానికి ఫిలిం దొరకనందువల్ల తెలుగులో చిన్న ఊళ్లలో వ్యాపారం కొంత దెబ్బతింది. ఈ కారణంవల్లనే అనేక కొత్త చిత్రాలు నిర్ణీత కాలానికి విడుదల కాలేదు. అయినా మొత్తం మీద వసూళ్లు పెరిగినట్లే (వినోదం పన్ను లెక్కల ద్వారా) తేలింది. ఇది నిజంగా పరిశ్రమ వర్ధిల్లుతున్న దనడానికి నిదర్శనం.

ఈ యేటిమరో విశేషం తారా చిత్రాలకీ డాక్యుమెంటరీలకు వసూలు చేసే రుసుము ప్రభుత్వం 1% కు తగ్గించడం.

1952 నుండి 58 వరకు చిత్రాల వివరం: 1952 లో మొత్తం చిత్రాలు 78 (తెలుగు 25) 53 లో 94 (తెలుగు 31).. 54 లో 94 (తెలుగు 28).. 55 లో 101 (తెలుగు 34)...56 లో 107 (తెలుగు 27)...57లో 117 (తెలుగు 36)...58 లో (తెలుగు 36).

## వార్తలు

విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి "రాజా మలయ సింహ" దర్శక నిర్మాత, ఛాయాగ్రహణ దర్శకుడు బి. ఎస్. రంగా గారి స్వంత స్టుడియో విక్రమ్ స్టుడియోలో చురుకుగా తయారవుతోంది. జానకి, రాజనాల మొదలగువారు నటిస్తున్నారు. రచన అనిసెట్టి, సంగీతం: విశ్వనాథం, రామమూర్తి. దర్శకుడు బి ఎస్ రంగా.

విశాల్ (పద్దంచే పెలి) ప్రొడక్షన్స్‌వారి కొత్త చిత్రం 'జయ విజయ' విజయ స్టుడియోలో తయారవుతోంది. కృష్ణకుమారి నాయిక. ఇందులో నరేంద్ర అనే కొత్త నటుని పరిచయం చేస్తున్నారు

సారథీ స్టుడియోస్ వారి కొత్త చిత్రానికి 'కుల దైవం' అని పేరు పెట్టారు.

## చిత్రసమీక్ష

# మాంగల్య బలం

“ఆ మూడుముళ్ళూ పడేవరకే ప్రేమా గీమా వంటివన్నీ ముందుకు వస్తాయి. ఎవరికోసం వస్తాయి మా” అంటారు సనాతన శాస్త్రిగారు.

“ఇద్దరు మనుషుల మనసులు ముందు కలిస్తే, వాటిని అప్రూవ్ చేసివేసే ఆమోద ముద్రనే మారేజ్ అంటారు” అంటాడు తెనుగిరీశం.

అయితే ఆనాడు వారూ, ఈనాడు వీరూ కూడా ఆ పద్ధతిలోనూ ఈ మార్గంలోనూ కూడా తమ తమ జీవిత భాగస్వాములను ఎన్నిక చేసుకుంటూనే వచ్చారు. ఏం చేసినా, దాంపత్యం మన్నికకు మాంగల్యం అంత మంచివస్తువు మరొకటి లేదని, ప్రేమబంధం తెగిపోయినా మాంగల్య బంధం వాళ్ళని అటిపట్టి నిలబెట్టగలదనీ ఈ దేశవాసుల చిరవిశ్వాసం. ఇంకో మెట్టు పైకివెళ్ళి, తెలియక వేరైన ఆలుమగలను ఒకచోట చేర్చే మహత్తుకూడా ఉన్నదని మాంగల్యబలంకథ చెప్పే కథవల్ల తెలుస్తుంది.

ఇలా పెళ్ళాడినవాడిని, భర్త అని తెలియకుండా ప్రేమించి పెళ్లి వేపు వెళ్ళడం అనేది కథల్లో నాయికలకే తటస్థపడతగ దుస్థితి. కథల్లోను జీవితంలోను కూడా బహు అరుదుగా సంభవించే ఈ విచిత్రమైన విలక్షణ సన్నివేశాన్ని తీసుకొని, దాని ప్రభావం క్రింద ఏర్పడే పరిస్థితుల రసాయనంలో మానవ హృదయపు లిట్మస్ పేపరు ఎలా రంగులు మారుతుందో ఎలా ప్రవర్తిస్తుందో సాధ్యమైనంత కట్టుదిట్టంగా చిత్రించి చూపడం ‘మాంగల్య బలం’ (అన్నపూర్ణ పిక్చర్సు) గల చిత్రకారుల లక్ష్యం అనిపిస్తుంది. ఇందులో రచయితలూ, దర్శకుడూ, ముఖ్య నటులు సావిత్రి, నాగేశ్వరరావు, ప్రశంసనీయమైన ఫలితాన్ని సాధించారు. కథావస్తువు విలక్షణది ఒకటే కాక, ఈ అందరి కృషి ఈ చిత్రానికి నేటి చిత్రాలలో ఒక విశిష్టతను సమకూర్చింది.

మాంగల్యబలం కథ బాల్యవివాహంతో ఆరంభమై, అపరిచిత వధూవరుల వ్యవహారంతో ముందుకు సాగి, దాదాపుగా గాంధర్వం కాబోయి ఆగి, రాక్షస వివాహంతో గమ్యస్థానం చేరుతుంది. అది అలా జరుగుతుందని మనకి తెలిసినా, అత్యంతం ఉత్కంఠను పోషిస్తు దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు రచయిత ఆత్రేయ కథను నడిపారు. ఇందులో మూడుముచ్చటవేసే రేలంగి కథను చెప్పగా కథకు ఉపశ్రుతి పలికేలా కలిపారు. ఇంకా మధ్య మధ్య మజిలీలు చేయించి రాగిణి, రాజసులోచన, సుకుమారి మొదలగు వారి నృత్యాలు ఏర్పాటుచేశారు.

వీటన్నిటివలా, ఈ చిత్రంలో సన్నివేశాల మీద సినీమార్కు జీవితపు క్రీనీడలు పడినా, దీనికిగల అవధులలో వాస్తవికత ఎక్కడా దెబ్బ తినలేదు. అసంభవం అనిపించే సంఘటనలు చొరబడలేదు. పొరబాటు లనిపించే బాటల్లోకి కథ వెళ్ళ లేదు. కట్టుదిట్టమైన ఈ సంవిధానంలో ఒక పెళ్ళితో విడిపోయిన రెండు కుటుంబాల మధ్య మరో పెళ్ళితో మరింత అగాధం ఏర్పడి, మళ్లీ పెళ్ళితో ఆ కుటుంబాలు దగ్గర కావడం ముఖ్యవృత్తం.

కథారంభం నాటికి రెండు రోజులపైన ఆయుర్దాయం ఉండదనిపించేలా కనిపించే సీతమ్మ, తన కొడుకు శేఖరానికి, అన్న కూతురు సరోజను చేసుకోవాలని ఆరాటపడుతుంది. అన్న పాపారావుకి వదిన కాంతమ్మకి ఇది పడదని కూడా ఆమెకి అనుమానం. ముసలావిడ పార్వతమ్మ, కూతురి బాధ చూడలేక పట్నంలో ఉన్న కొడుకుకు కబురంపి పెళ్ళికి వాగ్దానం చేయించాలనుకుంటుంది. అతడు వచ్చేలోగా, సీతకి ప్రాణం మీదికి రావడంతో సాహసించి ఏడేళ్ళపిల్ల సరోజకి, పదేళ్ల శేఖరానికీ (సరోజ ఆవిడతో వరదాకి పల్లెటూరు వచ్చింది) పెళ్ళి చేయించేస్తుంది. సీతమ్మ తృప్తిగా కన్నుమూస్తుంది. పాపారావు పెళ్ళిసంగతి తెలియ

### ‘మాంగల్య బలం’

పాత్రధారులు: నాగేశ్వరరావు, రంగారావు, రేలంగి, రమణమూర్తి. రమణారెడ్డి, డా॥ శివరామకృష్ణయ్య. ఎ. వి. సుబ్బారావుజూనియర్, చదలవాడ కుటుంబరావు, సీతారాం, లంక సత్యం, పేకేటి శివరాం, మాస్టర్ బాబీ సావిత్రి. రాజసులోచన, కన్నాంబ. సూర్యకాంతం, రాధిక, సురభి కమల, జి. వరలక్ష్మి, బేబీ శశికళ.

కథ: ఆత్రేయ, ఆదుర్తి సుబ్బారావు. డి. మధుసూదనరావు. మాటలు: ఆత్రేయ పాటలు: శ్రీశ్రీ, కొసరాజు. కళ జి. వి. సుబ్బారావు, కృష్ణారావు నృత్యాలు తోప్రా. సంగీతం: వేణు గాత్రధారులు: సుశీల, జమునారాణి ఘంటసాల, మాధవపెద్ది సత్యం, పీఠాపురం నాగేశ్వరరావు. ఛాయాగ్రహణం సెల్వరాజ్. ఎడిటింగ్: సంజీవి. శబ్దగ్రహణం: కృష్ణన్ (వాహిని) నిర్మాత డి. మధుసూదనరావు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, స్టూడియో: విజయ వాహిని.

తెలుగు తార గిరిజ హిందీ చిత్రంలో నటించేందుకు బొంబాయి వెళ్ళివచ్చింది. అక్కడ వాడియా బ్రదర్స్ అధిపతి హోమివాడియా, దర్శకుడు ఛాయాగ్రాహకుడు బాబుభాయ్‌మిస్త్రీ తో మాట్లాడుతున్న గిరిజ





'మాంగల్యబలం'లో నాగేశ్వరరావు, సావిత్రి.

గానే మండిపడి కోర్టుకెక్కి శారదా చట్టం కింద అది రద్దు చేయించి వేసాడు. అతని భార్య కాంతమ్మ, కూతురు మెళ్ళో పుస్తెల తాడు పుటుక్కున తెంచి పారేస్తుంది. ఆ పిల తక్షణం మెడనెప్పిపెట్టి బాగామని ఏడ్చేసేదేగాని, (మాంగల్య)బల వంతురాలు కాబట్టి నిభాయించుకుని ఉత్తమశ్రేణి విషాద నాయిక భంగిమలో నేపథ్యంలోంచి రాగల సాం... గీతికై ఎదురుచూస్తుంది. పది

తరవాత సరోజకి ఒక రోజున,
“నా జా పూచే రోజా రాలే”

మామూలుకన్నా తాజా గా కనిపిస్తాయి. ఆమెలో 'తెలియని ఆనందం' ఉదయిస్తుంది. కారణం ఆ క్షణాన ఆమె భర్త శేఖరం ఆమె ఎదుట నిలబడి పలకరిస్తున్నాడు. తనకి పెళ్ళి అయిందనిగాని అతడు తన భర్త అని గాని ఆమెకి తెలీకపోయినా అతనిపట్ల స్నేహభావం కలుగుతుంది. ఈ అమ్మాయి తను తాళికట్టిన భార్య అని అంతక్రితమే నాయనమ్మ పార్వతమ్మ ద్వారా తెలుసుకొన్న శేఖరం, అసలు సంగతి చెప్పకుండా, ముందట ఆమె ప్రేమను సంపాదించాలనీ, హక్కు దారుడిలా కాక, ప్రేమికుడుగా ఆమె కోరిన వాడుగా ఆమె జీవితంలో ప్రవేశించాలనీ ప్రయత్నిస్తాడు. ప్రేమ పరిపక్వం అయిన వేళకు, తీరా పెళ్ళిసంగతి చెప్పబోయేసరికి అవకాశం కుదరదు. అంతలో చిన్ననాడే తనకు పెళ్ళి అయిందన్న సంగతి సరోజకు తెలుస్తుంది. మాంగల్యంపట్ల పవిత్రభావం గౌరవించే సంప్రదాయాన్ని వంట బట్టించుకున్న సరోజ తక్షణం శేఖరంతో ప్రేమకలాపాలకు స్వస్తి చెబుతుంది. బుద్ధి జ్ఞానం వచ్చాక ఉదయించిన ప్రేమ కాబట్టి మనసును అదుపులో ఉంచుకోలేక మనసపడు తుంది. సంస్కారం ఉన్న స్త్రీగా, పత్నిగా తను, తానెరగని భర్తకెక్కడ ద్రోహం చేస్తుందో అనే భయపడుతుంది చివరకు నాయనమ్మ పుణ్యమా అని, తను ప్రేమించినవాడే, చిన్ననాడు తాళికట్టిన మొగుడు అని తెలియరావడంతో ఆమెకు దుఃఖం, కోపం, ఆనందం ఒక్కసారి కలుగు తాయి అంతలో పాపారావుగారు కూతు రికో పెళ్లి సంబంధం తెస్తాడు. ముహూర్తం ముంచుకొచ్చేసరికి శ్రీకృష్ణుడు చంద్రశేఖరం ఒక శిథిలరథంలో ఈ రుక్మిణీదేవిని ఎక్కిం చుకుని నాయనమ్మగారింటికి పారిపోతాడు మురిపించి మురిపించి కనిపించి, కనిపించి నవ్వించే ఆకారు (1927 నాటి ఫిఫట్ ఆట) చూట్టానికిలోకువగావున్నా, ఈ చిత్రంలో కథమలి విపరీతమైన వేగంతో ఆహ్లాదకరంగా పరిగెడుతుంది....ఈ ద్వగ భరితమైన సినీపతాక సన్నివేశాలమార్కు సన్నివేశాలు కొన్నిటి తరువాత చిత్రం సుఖాంతమవుతుంది

నటులు పాత్రను అర్థం చేసుకు నటించడం విధ్యుక్తకర్మం. మన చిత్రాలలో పాత్రలతో ఒకటే చిక్కు. వాటిలో అర్థం చేసుకుందికి అమోఘంగా బోలెడు వ్యక్తిత్వం వుండదు. ఉన్నది కాస్తాకూడా గట్టిగా అర్థంచేసుకుందికి ప్రయత్నించడం ఒక్కొక్కసారి అపార్థాలకు దారితీసి ప్రమాదహేతువు కావచ్చు. ఈ చిత్రంలో ముఖ్య పాత్రలు అలాంటివి కాకపోవడమే కాక, నటులకు శక్తి పరీక్షగా రూపొందా యనవచ్చు. ముఖ్యంగా ఐదు విందుప్రాణాలూ పోసుకుని, స్వతంత్ర దృక్పథాలతో, స్వంత అభిప్రాయాలతో, ఇష్టాయిష్టాలతో వ్యవహరించే సరోజ, శేఖర్ భూమికలరూప కల్పన గొప్పగా ఉంది. భాషలో దిగిన (ఆత్రేయ) భావాలకు అవ్యక్త భావాలూ అదృశ్యహావాలూ అనుశ్రుతులుగా ఉపయోగించుకొని సావిత్రి, నాగేశ్వరరావు ఈ రెండు ముఖ్యపాత్రల తత్వాలను అతిసమర్థంగా తెరమీద నిలుపగలిగారు. ఈ ఇద్దరూ కూడా ఇటీవల దాదాపు ఒక సంవత్సరంగా నటించిన అనేక చిత్రాలకన్న ఇందులో పైస్థాయిని అందుకున్నారనిపిస్తుంది. ఇతర పాత్రలన్నిటికీ కథలో సముచితమైన స్థానం ప్రయోజనం ఉన్నా, కొన్ని కొంత నిర్వర్ణంగా కనుపిస్తాయి. ఉన్నవారిలో రంగారావు, కన్నాంబ,రమణారెడ్డి తమ పాత్రలను మించిన ప్రతిభ ప్రదర్శించారు. మాటాడితే ముందూ వెనకా లేకుండా తుపాకీ పేలుస్తాననే పాపారావు అలాంటప్పుడు కనిపించేటంత భోళామనిషీ కాడు; తనకి తెలీకుండా కూతురుకి పెళ్ళిచేశారని తెలీగానే కోపావేశాన్ని, దుఃఖావేగాన్ని అణుచుకుని



నేషనల్ పిక్చర్స్‌వారి 'అంతా పెద్దలే'లో లలిత.

మాట్లాడుతున్నపుడు కనిపించేటంత నిండు మనిషి కాడు. అయినా నటుడు రంగారావు ఈ లక్షణాలను కొట్టివేయలేకుండా సమన్వయించాడు. విడిగా ఆయా ఘట్టాలలో ఆయన నటన స్మరణీయంగా ఉంది. అలాగే రమణారెడ్డి ఇందులో సమర్థుడికి ఉండే సౌలభ్యంతో అద్భుతంగా విహరించాడు. చిన్న చిన్న చెణుకులు ఎన్నో రమణారెడ్డి నటనలో మెరుస్తాయి,

చాలా చిత్రాల తరువాత తొలిసారిగా రేలంగి ఈ చిత్రంలో తిరిగి ఉన్నతం అనతగ్గ తనస్థాయిని అందుకున్నాడు. 'వైకుంఠం గారి చంటాడు కైలాసం' పాత్ర కథలో హాయిగా కలిసి ఒదిగిపోయింది. చిత్రం పొడుగునా ఆహ్లాదాన్ని పరచడానికి రేలంగికి మంచి అవకాశం దొరికింది; ఆయన అంతపనీ చేశాడు. ఈ పారి విశేషం ఆత్మహత్యకు పడిగడుతున్న మీనాక్షిని ఆపే సందర్భంలో, అవిడా ఈయనా భాషకి అభినయంపటడం. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు ఇలాటి రమ్యమైనసన్నివేశాలను ఇందులో అతి నేర్పుగా అమర్చి చిత్రించారు ఏదీ శ్రుతి మించకుండా, వికటించకుండా. సినీచాదస్తాల సంస్కారం లేకుండా చిత్రిస్తూ కున్నిత మైనవిషయాలను పసును చెడకుండా అవనుమానించి అర్థోక్తిలో వదలివేసి ఆలోచనలు రేకెత్తిస్తూ. (మధ్యలో ఫిల్మ్ పింబాలిజానికి లొంగకుండా) కథను నడిపేశిల్పం పట్ల సుబ్బారావుగారికి గల శ్రద్ధ ఈ చిత్రంలో (ఇది మూడవది) విశదం అవుతుంది.

'మాంగల్యబలం' చిత్రంగురించి గొప్పగా చెప్పుకోదగిన మరొక ముఖ్యాంశం సంగీతం. తొమ్మిది పాటలు ఇందులో ఉన్నాయి. వాటిలో నాలుగైదు పాటలు మనసుకు మంచి సంగీతం విన్నామన్న తృప్తిని కలిగిస్తాయి. శ్రీశ్రీ వ్రాసిన పాటలలో మాటవరసలు మనసులో పడేటందే మెదలుతాయి. నృత్యాలకు రాఘవయ్యగారు వ్రాసిన పాటలలో "ఔనంటారా" అనేది చాలా బాగుంది. కట్టుదిట్టమైనకథ, నటన, సంగీతం మనోహరమైనఛాయాగ్రహణం (తిరుపతి తోటలలో ఔట్‌డోర్ దృశ్యాలు ముఖ్యంగా చెప్పుకోదగినవి) నిండైనసంగీతం మొదలైనవన్నీ ఆహ్లాదకరంగా మేళవించి రూపొందించిన 'మాంగల్యబలం', ఉత్తమ శ్రేణి తెలుగు చిత్రం. ఇలాటివి అరుదుగా వస్తాయి అనిపింపచేసే స్థాయి చిత్రం.

ఐతే ఇందులో పార్వతమ్మ (కన్నాంబ) చివర సన్నివేశంలో తన బిడ్డల్ని మందలిస్తూ రెండు కుటుంబాలు కలవటానికి ఇంత రభస, ఇంత రక్తపాతం (కొంత ఇది జరిగింది) జరగాలా అంటుంది.

ఈ ప్రశ్నను విమర్శనదృష్టితో ఈ చిత్రం చివరిభాగానికి అన్వయించి సమాధానం అన్వేషించితే సమాధానం ఎవరు చెప్పాలి అని ఒక ప్రశ్న ఎదురవుతుంది. నిర్మాతలా? పరిశీలకులా? ప్రేక్షకులా? ★



"అసలీ కారెక్టర్ని కథాంతంలో చంపేసి సుఖాంతం చెయ్యాలి. కాని ఇవ్వాళ ఆ యాక్టరికీ మా డైరెక్టరికీ ఏవో మాటామాటావచ్చిపోట్లాటైంది. అందుకని మధ్యలోనే అతన్నిహతమార్చేస్తూ, కథమార్చేస్తున్నాం."

# వార్తలు

సురభి ఫిలింస్‌వారి తమిళ చిత్రం 'వీర విజయన్'ను మాతృశ్రీ పిక్చర్స్ వారు 'విజయవిక్రమ' పేరిట తెలుగులో తయారు చేస్తున్నారు. ఇందులో బి. ఎస్. సరోజ, కుచలకుమారి, మీనాక్షి (బొంబాయి), ప్రేమనజీర్ నటించారు. మాటలు, పాటలు కొండముది గోపాలరాయశర్మ వ్రాస్తున్నారు సంగీతం: ఎం. సుబ్రహ్మణ్యంరాజు. నిర్వాహణ: సురటి దుర్గారావు. నిర్మాత: ధరణికోట వెంకట సుబ్బయ్య.

నటుడు అమరనాథ్ శ్రీ పరళి అండ్ జన్మభూమి ఫిలిమ్స్ పేరిట నిర్మిస్తున్న చిత్రానికి ఈనెల 24-వ తేదీన మైసూరు ప్రిమియర్ స్టుడియోలో షూటింగు ఆరంభిస్తున్నారు. ఇందులో అమర్ నాథ్, రాజనాల, చలం, కృష్ణకుమారి, హేమలత కుసుమకుమారి మొదలగువారు పాల్గొంటున్నారు సుశీల, శ్రీనివాస్ పాడినపాటలు నాలుగు మొన్న రికార్డు చేశారు. సంగీతం నిత్యానంద్. రచయిత రామచంద్. దర్శకుడు శోభనాద్రిరావు.

* * *

'తలాక్' చిత్రంలో చలాకి జంటగా కనిపించిన కామినీకదమ్ రాజేంద్రకుమార్‌లను, రత్నదీప్ పిక్చర్స్‌వారు తిరిగి మరో చిత్రంలో నాయకా నాయకులుగా నిలిపి 'మాబాప్' అనే చిత్రం తీస్తున్నారు. ఇందులో 'మా' లీలా చిట్నిస్. బాప్ ఎవరో ఇంకా తెలియదు. తల్లిదండ్రుల ప్రేమ ఎంత గొప్పదో చెప్పే ఇతివృత్తంగల ఈ చిత్రానికి రాజేంద్రకిషన్ మాటలూ పాటలూ వ్రాస్తున్నారు. సంగీతదర్శకుడు చిత్రగుప్త. దర్శకుడు వి. ఎం. వ్యాస్.

* * *

నవకేతన్ పేరిట దేవానంద్ తీసిన్న 'కాలాపానీ' చిత్రం విడుదల అయింది దేవానంద మధుబాల, నళినీ జయవంత్, ఆగా, ముక్రీ, రాధాకిషన్, నజీర్ హుసేన్, కిశోర్ సాహు ఇందులో పాల్గొంన్నారు. దర్శకుడు రాజ్ ఖోసా.

సంగీతం సచిన్‌దేవ బర్మన్.

* * *

డబ్బు గొడవలో పెళ్లాం బిడ్డల్ని మర్చిపోయి, వాళ్ళు గుర్తుకొచ్చినమీదట అరాంగి పట్ల అపోహపడి లేచేలోగా ఒకానొక కుటుంబరావు తన కుటుంబంలో ఎంతటి అశాంతినికలిగిసాడో ఎలాక్షోభ పెడతాడో చెప్పడం లక్ష్యంగాగల సమకాలిక ఇతివృత్తంతో మోహన్ సైగల్ 'లాజ్‌వంతి' అనే చిత్రం తీస్తున్నారు. నిర్మాణం పూర్తి కావచ్చింది. ఇందులో కుటుంబరావుపేరు బల్ రాజ్ సాహ్నీ, అర్ధాంగి నర్గిస్.



విజయవారి 'అప్పుచేసి పప్పుకూడు'లో రామారావు

గురుదత్ సినిమాస్కోప్‌చిత్రం 'కాగజ్ కి ఫూల్' నాలుగింట మూడుపాళ్ళు ముగిసింది. ఒక ఫిలిం డైరెక్టరు జీవన వ్యాపారాన్ని చూపే ఈ చిత్రంలో గురుదత్, వహీదా రెహమాన్, జోకర్ జానీవాకర్, నాజ్ నటిస్తున్నారు. సంగీతం బర్మన్.

## సినీవార్త

చాలకాలంగా అంగ్లంలో 'కినీస్పోర్ట్స్' పత్రికను నిర్వహిస్తున్నవారు ఇప్పుడు కొత్తగా 'సినీవార్త' 'ఏన్యూఎల్' అనే రెండు మాసపత్రికలు ఆరంభించారు. తెలుగులో వస్తూన్న 'సినీవార్త' సంపాదకులు 'గను', శ్రీ ఎం. సింగ్. సినిమా పరిశ్రమపై వ్యాసాలూ, కథలూ, వార్తలూ మొదలయిన వివిధ శీర్షికలతో ఛాయా చిత్రాలతో దీనిని ఆకర్షణీయంగా వెలువరించారు. పలభై పుటలు. అర్థకాగితం పైముఖచిత్రం. వెల 40 నయాపైసలు.

# ★ మేమూ వారపత్రిక ★

(16-వ పేజీ తరువాయి)

అవి చిత్ర విచిత్రాలుగా చదువురాని వారికి చెప్పేవాడు హీరోలాగ.

మా వదిన గారి సంగతి. ఆమెకు నవలలన్నా, రసవత్తరమైన కథానికలన్నా చాలాయిష్టం. చదువుతుంది. ఆమె ఇంగ్లీషుకూడ బాగా చదువుకుంది. ఆమె ఇంగ్లీషులో చదివిన, నవలలు, తెలుగులో అనువాదాలుగా వస్తున్నప్పుడు ఇంగ్లీషు నవల, తెలుగు అనువాదము పక్కనే పెట్టుకొని చదివేది. రచయిత ఇంగ్లీషు భాషలోని సొంపుల్ని ఎంతవరకు తెలుగులో చూపించాడో జాగ్రత్తగా పరిశీలించేది. మాకు ముందుగా నవలలోని ఘట్టాల్ని టూకీగా చెప్పేది. "కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో, రెండుమహానగరాలు" అనే నవలను అనేకసార్లు చదివింది రెండు భాషల లోను.

ఆంగ్ల భాషలోని గొప్పనవలలను తెలుగు సాహిత్యంలోకి ప్రవేశపెడుతున్నారని మా వదినకు అభిమానము ఆంధ్ర వారపత్రికంటే. ఆ అభిమానమే నాకూ ఉంది యిప్పటికీ.

* * *

ఇక నా సంగతి. కొద్దిగా చదువుకొన్న మహిళలకు 'వనితాలోకం' ద్వారా విజ్ఞానాన్ని పెంపొందింపజేస్తున్నారు. ఒకసారి ముక్కోటి సేవను హాలుకు కొత్తపత్రిక బజారులో కొని తీసికొనివెళ్ళాను. దానిని మా డాక్టరు చూసింది. వెంటనే తిసికొంది. పరీక్ష పేపరు యిచ్చి, కుర్చీలో కూర్చొని చదువటము ప్రారంభించింది. ఎక్స్ రే షీటు కావాలన్నా, డాక్టరు దగ్గరకొచ్చి తీసికొమ్మనేది. అది పరీక్షాహాలు అనే సంగతే మర్చిపోయింది. అప్పుడు, నేను అనుకొన్నా పత్రిక అంటే అందరికీ ఇష్టమేనని.

* * *

పాఠకుల అభిరుచుల్నిబట్టి పత్రికలో శీర్షికలను ప్రవేశపెట్టటంలో ఎడిటరు గార్ని అభినందించక తప్పదు. కొన్ని రోజులు 'విజ్ఞాన వీధులు' అనే శీర్షికద్వార సైన్సునుగురించి చెప్పేవారు. ప్రస్తుతం సరికొత్తగా 'రాజధాని-కబుర్లు' అనే శీర్షికను ప్రవేశపెట్టారు. దీనిని చదువుతూవుంటే ఎంతో ఉత్సాహంగా వుంటుంది. ఈ విధంగా పత్రికను ఆకర్షణీయంగా, పాఠకుల మనోభావాల్ని గ్రహించి రూపొందిస్తున్నందుకు ఎడిటర్ గారికి నా అభినందనలు.

* * *

వారపత్రిక అంటే పెద్దలకు మాత్రమే అభిలాష అనుకోనేరు. పిల్లలకుకూడ చాల యిష్టము. నా చిన్నతనంలో రోజూ నేను మా తాతయ్య దగ్గరకూర్చొని కథలన్నీ చదివేదాన్ని. ఇప్పుడు మా యింట్లో మా అన్నయ్య గారి పిల్లలున్నారు. పత్రికలో నిర్వహించు బాలసాహితి అంటేవారికీ, మా పిల్లలూ చెవికోసుకుంటారు. చిన్న పిలల కథల్ని, చిన్న పాటలను సులభ శైలిలో పత్రిక ద్వారా వెలువరించుట ద్వార, బాలురకు పత్రిక చదవాలనే ఉత్సాహము అనుకోకుండానే కలుగుతున్నది. అవసరాల రామకృష్ణరావు గారు రచించిన పిల్లల సీరియల్ 'కేటూ-డూప్లికేటూ' పిల్లలనేగాక పెద్దలను కూడ ఆకర్షించింది.

ఇటీవలను అనేక రకములైన వస్తుల గురించి ఫోటోలతో సహా ప్రకటించారు. వీటిని జాగ్రత్తగా కత్తిరించి ఆల్బమ్‌లాగా తయారుచేసి పిల్లలకు పాఠము చెప్తుతుందట—మా యింటి పక్కనవున్న పంతులమ్మగారు.

* * *

ప్రస్తుతము ఆంధ్రపత్రిక రాగానే,—

మా తాతయ్య నక్షత్ర ఫలితాలకోసం

మా నాన్నగారు మహాభారతం పఠించుట కొఱకు,

మా వదిన 'జీవనలీల' కోసమూ,

నేను వనితాలోకం శీర్షిక కొఱకూ,

మా అన్నయ్య 'న్యూఢిల్లీ' లేఖ కొఱకు,

మా తమ్ముడు బాలసాహితి కొఱకు,

"మా స్నేహితురాలు" సినిమా కొసమూ,

మొదట చూసాము. తరువాత మిగతా శీర్షికలను తీరికగా చదువుతాము.

ముక్కోటి ఆంధ్రుల అభిమాన పత్రిక 'ఆంధ్ర వార పత్రిక' అని వేరే చెప్పాలా మీకు! ★

# ★ రాజధాని కబుర్లు ★

[7-వ పేజీ తరువాయి]

## 'స్టేజి విలనులు': (2) మైక్రోఫోన్

రాజధానినగరంలో అనేక నాటకప్రదర్శనలు జరుగుతున్నాయి. కొన్నిటిలో నాటకం బాగుండకపోవడం; కొన్నింటిలో రచన బాగుండి నటన ఉన్నతస్థాయికి చేరకపోవడం; మరి కొన్నింటిలో అన్నీ బాగున్నా ప్రదర్శన బాగుండకపోవడం జరుగుతుంది.

ఈ విధంగా ప్రదర్శనలు పాడైపోవడానికి కారణంగా కొందరు (లేక కొన్ని) స్టేజి విలనులను 'ప్రవీణుడు' పేర్కొనదలచాడు. టెలిఫోన్ ఉదంతం చదివారు. మైక్రోఫోన్ ఉదంతం చదవండి.

నాటక ప్రదర్శనల్లో మైక్రోఫోన్ వాడే ఆచారం మనకు ఇదివరలో లేదు. ఔత్సాహిక నాటకబృందాలు తెచ్చిపెట్టుకొన్న వెపద ఇది. గత సంవత్సరం వేల్స్ విశ్వవిద్యాలయ బృందం హైదరాబాదు వచ్చినప్పుడు వారు మైక్రోఫోను ఉపయోగించే ఆచారం లేదని స్పష్టంగా చెప్పారు.

నటుడు రంగస్థలంపై తిరుగాడుతున్నప్పుడు, అతని కంఠస్వరంలో మార్పులు అతడు తలపెట్టినట్లుగా రావాలి. మైక్రోఫోనులో మాటాడకపోతే వినపడదేమోనని ఈ నాటి నటులు ఆ యంత్రంచుట్టూ కుమిగూడి ప్రదక్షిణాలు చేయడం జరుగుతుంది. నటుడు యంత్రానికి దూరంగా ఉండి, భీకరంగా అరిచినా అది ప్రేక్షకులకు రహస్యంగా వినపడ్డం, అదే నటుడు మైక్ వద్ద పరమ శాంతమూర్తిగా భాషించినా, ప్రేక్షకుల హృదయాల్లో పరమ క్రూరుడిలా భాసించడం జరుగుతుంది.

ఐదారు సంవత్సరాల క్రితం నేను ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ఒక నాటకంలో నటించిన తరుణంలో, మైక్రోఫోన్ యంత్రాన్ని వాలినూన్న ఇంజనీరుడు, నా నటనా సామర్థ్యానికి సొమ్మసిల్లి పోవడం జరిగింది. సగం మూర్ఛలో అతగాడు మైక్రోఫోన్ యంత్రాలను సవరించాడు. రంగస్థలంపైనున్న మైక్రోఫోనులతోడు. ఒకటి అదనంగా తెరవెనుక ఉంది. ప్రాంప్టరు చెప్పే మాటలన్నీ ఆనాడు పది వేలమంది ప్రేక్షకులు విని ఆనందించారు. ఆ ఆనందించిన వారిలో భగదీయుడు లేడు. ప్రాంప్టరు 'అవును, అవును, అవును' అని అందిస్తుండం విన్న ప్రేక్షకులు, అవే చెవులతో నేను 'కాదు, కాదు, లేదు' అని తడబడ్డం విన్నారు. నిలబడ్డ ప్రేక్షకులు దూరంగా ఉండడంవల్ల, ఆ నాటిరాత్రి నేను ఆసుపత్రికి వెళ్ళవలసిన అవసరం లేకుండా సురక్షితంగా ఇంటికి చేరుకున్నాను.

ఈ మైక్రోఫోనుకు మెదడు లేదని మీరు అంగీకరిస్తారు. కాని దానితలకు వెనుక బంధించి పొడుగాటి తీగ ఉంటుంది. ఆ తీగ కాలికి తగలకుండా నటీనటులు చిన్న ఎత్తున భరతనాట్యం చేయడం కూడా కద్దు. కోపంగా ఎడమనుంచి ప్రవేశించిన ధీరుడు హఠాత్తుగా మధ్యలో ఆగి, ఎడంకాలు ఎత్తి తీగల్ని దాటి, తరువాత కుడికాలు ఎత్తి తీగల్ని దాటి, మళ్ళీ కోపంగా ముందుకు నడుస్తుంటాడు.

'ఖణి' నాటకంలో టెలిఫోనులో సంభాషణలుకూడా ప్రేక్షకులకు వినపడాలి. ఆ పలుకులు పలికిన నటీనటులుముందు ఒక 'మైక్' ఉండడం, రంగస్థలం పాత్రధారి మైక్‌కు దూరంగా ఉండడం జరిగింది. ఈ కారణంవల్ల ఎదురుగా ఉన్న నటుడి సంభాషణలు ప్రేక్షకులకు స్పష్టాస్పష్టంగా వినబడి, టెలిఫోన్‌లో సంభాషణలు తెరలను చీల్చుకు బయటకు వచ్చాయి.

ఇదీ 'స్టేజి విలన్ నంబర్ టూ: మైక్రోఫోన్' ఉదంతం. నాటక ప్రదర్శన ఫలితంగా రసపృష్టి కలగాలన్న మిత్రులందరూ మైకుల మైకంనుంచి విడివడి బయటకు రావడం మంచిది. ★

# లలిత కళాశాల

(33 వ పేజీ తరువాయి)

కాగు శస్త్రప్రదర్శనశాల వంటిచోట్ల స్థానిక చిత్రకారులు వేసిన వస్త్రచిత్రాలు చాలా ఉన్నాయి ఇక్కడి అధ్యాపకులు, పూర్వం విద్యార్థులూ వేసినచిత్రాలనేకం. ఢిల్లీ నేషనల్ ఆర్టుగాలరీ, పార్లమెంటుహౌసు రాష్ట్రపతి భవనముల (బొలారం)లో ఉన్నాయి.

కళాశాల చిత్రలేఖన, శిల్పకళాశాఖల అధిపతులు ఉన్నత విద్యలో, శిక్షణకై యుగోస్లావియా ప్రభుత్వ గౌరవ వేతనంపై విదేశం వెళ్ళారు ఇక్కడివారి చిత్రాలూ శిల్పాలూ, విదేశాలలో భారత చిత్రకళా ప్రదర్శనాలలో నిలిచి ప్రశంస లందుకున్నాయి.

కొలంబో పథకం క్రింద ఒక నేపాలీ చిత్రకారుడు ఇక్కడ శిక్షణ పొందుతున్నాడు. ఇక్కడ స్త్రీలు కూడా విద్య నభ్యసిస్తున్నారు. అందరికీ వసతి గృహాలు ఉన్నాయి.

పిల్లలలో లలితకళాభిరుచికి పెంపొందించడానికూడా ఈ సంస్థ కృషి చేస్తున్నది. 1953లో ప్రిన్సిపాల్ ప్రభుత్వానికి అందచేసినఒక పథకం ప్రకారం, ఇక్కడ పబ్లిక్ గార్డెన్స్‌లో ఐరన్ బంగళాలో బాల చిత్రకళా మందిరం నెలకొల్పడం జరిగింది. బ్రిటన్, రష్యా, చైనా, జపాన్, టర్కీ, జెకోస్లావాకియా, జర్మని, న్యూజిలాండ్, నార్వే, సిలోన్ మొదలైన దేశాలనుండి ఈ కళాశాలవారు 400 చిత్రాలను తెప్పించి ఇక్కడ ఉంచారు. దీని అభివృద్ధికి ప్రభుత్వం తగు ప్రోత్సాహం ఇస్తున్నది.

లలితకళాశాల ఇప్పుడు అద్దెకు తీసుకున్న భవనంలో ఉంటు



కల్లనిషా
చిత్రకారుడు : సయ్యాద్ బిన్ మహమద్.

న్నాంగువల మరమ్మతులకు గాని, అవసరాలనబట్టి అభివృద్ధికి తగు కొత్త హంగులు ఏర్పాటు చేసుకోవడానికిగాని సదుపాయం లేకుండా ఉంది.



# ★ జీవనలీల ★

(19 వ పేజీ తరువాయి)

ఇప్పుడు కుముద్ పుస్తకం చదువుకుంటూ పడుకుంటే మధ్య మధ్య వచ్చి అతడికేసి తొంగిచూస్తూ ఉండటం ఎంత ఆనందంగా ఉంది మతికి. కుముద్ దగ్గర లేనప్పుడు ఆమెకి శరీరం - మనస్సుకూడా పులకరిస్తున్నాయి. ఒంట్లో ఓపికంతా ఉడిగిపట్లు ఒకమూల కూర్చోటం ఎంత బావుండేదో- అటూ ఇటూ తిరుగుతూ పనులు చేసుకుంటూ ఉండటంకూడా అంత బావుంటోంది మతికి. అంటు తోమటం కూడా ఆమెకేదో ఆనందంగానే ఉంది ఈ ప్రపంచంలో ప్రతిదీ అందంగానూ- హాయిగానే కన్పిస్తోంది.

"ఏమిటి ? ఏమివచ్చిందీ? చూపు అదోకరకంగా ఉంటోంది ఉండిఉండి నవ్వుతూ ఉంటావు. గదదకంఠంతో మాట్లాడుతూంటావ్. ఏమిటీ సంగతి ?" అని అడిగింది జయ.

ఏమిటో అది మతికిమాత్రం సరిగా తెలుసా ? అమాయకంగా తలఊపింది. జయ నవ్వుతూ "నీ కేదో కవిత్వం ఎక్కుతోంది మతీ. కవిత్వం - కవిత్వం పట్టుకుంది" అన్నది.

అప్పుడు మతి జయకి విశదంగా చెప్పటానికి ప్రయత్నిస్తూ "మనస్సేమిటో తేలిపోతోంది అక్కా !" అన్నది.

"అదే కవిత్వంఎక్కడం అంటే"

జయ గంభీరంగా, ఒక రకమైన కొత్తదృష్టితో కొంచెం పరిశీలనగా చూసింది మతిని. మతి కొంచెం వెనకా ముందాడుతూ "మీకు పెళ్ళయి ఎన్నాళ్ళయింది అక్కా ?"

"రెండేళ్ళు"

"ఇంతేనా ? అంటే ఈడు ముదిరాక పెళ్ళయిందన్నమాట!"

"నీతో పోల్చిచూస్తే అంతే - నీ కదిలోకి వెడదాంరా మతీ! నిన్ను కొన్ని అడగవలసినవి ఉన్నాయి."

కుముద్ మతిని మొదటో ఎప్పుడు ఎక్కడ ఎలాచూశాడో ఆ సంగతి తెలుసుకోవాలని జయ ఎన్నడూ కుతూహలంచూపలేదు. అలాంటిది మతిని ఇవాళ చాలాసంగతులు తరచి తరచి అడిగింది. ఇంచుమించు అన్నీ అడిగింది. ఇలాంటి రహస్యమైన సంగతులు ఎప్పుడైనా ఎవరిముందైనా చెప్పవలసిఉంటుందేమో అన్న విషయాన్ని మతి ఏనాడూ ఊహించికూడా ఎరుగదు. ఇవాళ్టికి ఇప్పుడు అన్నీ అడిగతెలుసుకుంటానని జయ పట్టుపట్టేసరికి మతి ఆశ్చర్యపోయింది. ఏదో ముకసరిగా కొన్ని దాచి, కొన్ని సంగతులే చెప్పటానికి ప్రయత్నించింది మతి కాని జయ అలా చెప్పనీయలేదు. ఉన్న యథార్థానికి చిలవలుపలవలు కలిపించి చెపితేనే ఆమె తృప్తిగా ఉండేట్లుంది.

"అయితే కుముద్ నిన్ను నిజంగా ప్రేమిస్తున్నాడా మతీ ?"

ఇలా ఈ ప్రశ్న అడగటంలో అర్థం ? కుముద్ తనని ప్రేమించటంలేదని అనుకుంటోందా జయ ? మతి జయకేసి సగర్వంగా చూసింది. నీ భ్రమ తొలగిపోయిందా ? కుముద్‌కి చాలాకాలం నుంచి స్నేహితురాలివా ? మతితో తమాషా చెయ్యబోకు......

"కుముద్ ఏవరికి నిన్ను ప్రేమించాడా మతీ ?"అని అడిగింది జయ.

ఏదో కోటీసటయి "ప్రేమించకపోవటమేమిటి ? నేను వారికి ఎన్ని జన్మలనుంచి భార్యనో తెలుసా" అన్నది మతి

"అదికూడా తెలుసా ? జన్మజన్మాలనుంచి నువ్వేభార్యవా ?

"నువ్వు తెలియబోయేట్లు చేస్తున్నావ్ మతీ ! విద్యాబుద్ధులతో, సౌందర్యంతో సంగీత సాహిత్యాలతో, నాట్యంతో ఎవరూ వశపరచుకోలేనివాణి —— వేలెడంతదానివి నువ్వు వివశుణ్ణిచేశావు. తక్కువదానివేం కావు నువ్వు !"

"ఎవరూ వారిని వశపరచుకోలేదా ? ఎవరువాళ్ళు ? తెలుసానీకు ?"

"తెలుసు, కాని నీకు చెప్పను."

"చెప్పు అక్కా చెప్పు. నీకాళ్ళుపట్టుకుంటా చెప్పు"

జయ కొంచెం ఇరుకునపడ్డధోరణిగా" "చెప్ప నీమనసుకి కొంచెం కష్టంకలిగించాలనేఉంది మతీ ! అయినాసరే చెప్పను. విని మాత్రం ఏంచేస్తావ్ ? వాళ్ళంతా ఇప్పుడెక్కడ ఎలాఉన్నారో కూడా తెలియదు. అదికాక నీ కెందుకు భయం మతీ? ఎవరూ లాక్కుని పోలేరతణ్ణి. ఒకసారి వెనక్కి తిరిగి వచ్చినవాడే మళ్ళీ నీకోసం గాక వాళ్ళదిక్కుకి పరుగెత్తాడు "

—ఇంకావుంది]

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.




పసుల కాపరి

చిత్రం : ఇ. రమేష్-రాజమండ్రి

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.